

జెమ్స్‌తో బలే మజా
అదృష్టవంతులు గెలుపొందేందుకు 1001 బహుమతులు
ఈ క్రింది సంఖ్యలు కల్గిన ఐదు చిత్రాలలో ఏది ఇక్కడి
ఖాళీలో సరిపోతుందో చెప్పుకోండి చూద్దాం.
?
1
2
3
4
5
Cadbury's MILK CHOCOLATE
GEMS
త్వరపడండి! మీ జవాబుతోపాటు క్యాడ్‌బరిస్ జెమ్స్ యొక్క ఖాళీ ప్లాస్టిక్ ప్యాకెట్ ఒకటి జతపరచి పంపండి. సరియైన జవాబు పంపిన మొదటి 1001 మంది విజేతలకు రూ. 11 విలువగల స్టేట్ బ్యాంక్ కానుక చెక్‌లు లభిస్తాయి.
మీ జవాబు, మీ పేరు, మీ చిరునామా కూడా ఇంగ్లీషులోనే విడి అక్షరాలలో వ్రాయండి.
మీ ఎంట్రీలను ఈ క్రింది చిరునామాకు పంపండి.
"Fun with Gems" Dept B-23
Post Box No. 56. Thane 400 601.
ఎంట్రీలు గ్రహించబడేందుకు ఆఖరు తేది:
30-4-1977
చాక్లెట్ మధ్యలో గలిగిన రంగురంగుల క్యాడ్‌బరిస్ జెమ్స్
CHAITRA-C-69 TEL

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

1976 జనవరిలో చందమామ పాఠకులకు ''అబద్ధం'' అన్న కథ ఇచ్చి పోటీపెట్టాం. ఆ కథలో సభికుడు రెండు అబద్ధాలు ఆడాడు. ''రాజా, అబద్ధం ఆడి మిమ్మల్ని నమ్మించగలను'' అన్నది మొదటి అబద్ధం. కాని అతను రెండో అబద్ధం- ''ఇంకా చెప్పేదేమిటి ? గెలిచాను''-చెప్పేనదాకా మొదటిది అబద్ధం అనిఎవరూ గ్రహించలేరు. పోతే, రాజు స్పష్టంగా రెండో అబద్ధాన్నే నమ్మాడు. ఎందు కంటే అది రాజు ప్రతిజ్ఞను బలపరుస్తుంది గనక.

రు 100 లు. బహుమానం పొందినవారు : వంగర భగవాన్, కొత్తపేట, శీలంవారివీధి, గుంటూరు.

సంపుటి 60 ఏప్రిల్ '77 సంచిక 4

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00

CHANDAMAMA PUBLICATION

# అమరవాణి

ఆర్తో వా. యదివా దృప్తః
పరేషాం శరణాగతః.
అరిః ప్రాణా స్పరిత్యజ్య
రక్షితవ్యః కృతాత్మనా. 1

[కష్టంలో ఉండేవాడైనా, పొగరుబోతు అయినా శత్రువు శరణు వేడితే నిశ్చితబుద్ధితో ప్రాణాలు ఒడ్డి అయినా సరే రక్షించాలి.]

సచేద్భయాద్వా. మోహాద్వా
కామాద్వాపి న రక్షతి
స్వయా శక్త్యా యథా సత్త్వం
తత్పాపం లోకగర్హితం. 2

[భయం చేతగాని, అజ్ఞానం చేతగాని, కామం చేతగాని శరణు జొచ్చినవాణ్ణి శాయశక్తులా రక్షించకపోతే అలాటి పాపి లోకనిందకు గురి అవుతాడు.]

వినష్టః పశ్యత స్తస్య
రక్షిణః శ్శరణాగతః,
ఆదాయ సుకృతం తస్య
సర్వం గచ్ఛే దరక్షితః. 3

[శరణాగతుణ్ణి రక్షించనివాడు పూర్వం చేసుకున్న పుణ్యమంతా పోగొట్టుకుంటాడు.]

శరణాగత రక్షణ



# కాకోలూకీయం

## 46

విష్ణుశర్మ రాజకుమారులతో ఇలా అన్నాడు:

"శత్రువు మిత్రుడుగా నటించినప్పటికీ అతన్ని ఎన్నడూ నమ్మవద్దు. అలాటి కపటమిత్రుడి సహాయంతో కాకులు గుడ్లగూబల ఇల్లు కాల్చేశాయి."

"అదెలాగ?" అని రాజకుమారులు అడిగారు. విష్ణుశర్మ వారికి కాకోలూకీయం కథ చెప్పాడు.

* * *

దక్షిణదేశంలో ఒక పెద్ద అరణ్యంలో అసంఖ్యాకమైన శాఖలు కలిగి, అంతులేని ఊడలు దిగిన మహా వటవృక్షం ఉండేది. దాని మీద మేఘవర్ణం అనే కాకిరాజు తన కాకిబలగంతో నివసిస్తూండేది.

అక్కడికి ఒక కోసు దూరాన ఒక కొండచరియలోని గుహలో అరిమర్దనం అనే గుడ్లగూబరాజు తన అనుచరులతో నివసించేది. దానికి కాకిరాజుతోనూ, కాకులతోనూ బద్ధవైరం ఉండేది. గుడ్లగూబరాజూ, దాని అనుచరులూ ఎక్కడ కనిపిస్తే అక్కడ కాకులను చంపేస్తూండేవి. ఆ కారణంగా వటవృక్షం చుట్టూ ప్రతి రోజూ కొన్ని కాకులు చచ్చిపడి ఉండేవి.

ఒకనాడు కాకిరాజు తన మంత్రులనూ, సలహాదార్లనూ పిలిచి ఇలా అన్నది:

"పెద్దలారా, రాత్రివేళ మనం నిద్రలో ఉండి, చూడటానికైనా శక్తిలేని అసహాయస్థితిలో ఉన్నప్పుడు మన శత్రువులు మనకు చాలా నష్టం కలిగిస్తున్న సంగతి మీ రెరిగినదే. పట్టపగలు గుడ్లగూబలు చూడలేవన్న మాట నిజమే. కాని ఆ సమయంలో అవి తమ పర్వతగుహలో భద్రంగా ఉంటాయి. ఆ గుహను మనం

పట్టలేం సరేగదా, అది ఎక్కడ ఉన్నదీ కనిపెట్టనుకూడాలేం. శత్రువునూ, వ్యాధినీ పెరగనివ్వటం ప్రాణహాని అంటారు. కనక, మనం బతికి బాగుండాలంటే ఈ తీవ్రసమస్యను ఎదుర్కోవాలి. అపాయాన్ని ఎదుర్కొనటానికి ఆరు మార్గాలు: శత్రువుతో రాజీపడటమూ: శత్రువుతో యుద్ధంచెయ్యటమూ; మన స్థావరాన్ని మార్చటమూ; ఉన్న స్థావరాన్ని బలపరచటమూ; బలవంతులైన మిత్రులను సంపాదించటమూ; యుక్తి చేత గాని, వంచన చేత గాని కార్యసిద్ధి పొందటమూనూ. మనం ఏ పద్ధతి అవలంబించాలో నిర్ణయించటానికి రహస్యసమాలోచన ఏర్పాటుచేస్తున్నాను.''

ఇలా అని కాకిరాజు ఉజ్జీవీ, సంజీవీ, అనుజీవీ, ప్రజ్జీవీ, చిరంజీవీ అనే తన మంత్రులతోనూ, స్థిరజీవి అనే వృద్ధ సలహాదారుతోనూ రహస్యసమాలోచన జరిపింది.

అది ఒక్కొక్క మంత్రి అభిప్రాయాన్నీ అడిగింది.

''రాజా, శత్రువు బలాఢ్యుడు. మనకు అతడితో యుద్ధం సాధ్యంకాదు. మనకు బలం చేకూరేదాకా మనం శత్రువుకు తలవంచాలి. ప్రాణాపాయస్థితిలో బలవంతులతోనూ, దుర్మార్గులతోనూ సైతం శాంతి నెరపాలి. ప్రాణం ఉంటేనే ఆశ అనేది ఉండేది. యుద్ధం జూదంలాటిది. గత్యంతరం లేకపోతేనే యుద్ధానికి దిగాలి.



సాధ్యమైనంత అనుకూల నిబంధనలతో శాంతి చేసుకోవాలని నా ఉద్దేశం,'' అన్నది ఉజ్జీవి.

''నీతికి నిలవని క్రూరశత్రువుతో శాంతినెరపే సమస్య ఉండదు. ఒప్పందాలకు గుడ్లగూబలు కట్టుబడవు. మనను నాశనం చెయ్యటానికే ఒప్పందాలను అవి ఉపయోగించుకుంటాయి. యుద్ధమే నా మతం. మన పైకి ఒంటికాలి మీద వచ్చే శత్రువుతో యుద్ధం చాటవేయట మంటే ఆత్మనాశనం కోరితెచ్చుకోవటమే," అన్నది సంజీవి.

''శత్రువు పాపీ, బలవంతుడూ, ద్రోహీ. అందుచేత మనకు యుద్ధమూ వద్దు, శాంతీ వద్దు. స్థావరం మార్చుకుందాం. గుడ్లగూబలకు ఇంత సమీపంగా ఉండటం అపాయకరం. మనం ఈ స్థావరాన్ని విడిచి వెళ్ళటం పలాయనం అనుకునే పనిలేదు. మనం మళ్ళీతిరిగివస్తాం," అన్నదిఅనుజీవి.

''స్వస్థలాన్ని విడవటం నాకు సమ్మతం కాదు. అదే బలం. మొసలి నీటిలో ఉండి ఏనుగును జయించగలదు, కాని బయటికి వచ్చి కుక్కను ఎదిరించలేదు. మనం ఈ చోటు వదిలిపోతే తిరిగిరావటం కల్ల. మనకు ఐకమత్యం ఉంటే మనని ఎవరూ జయించలేరు,'' అన్నది ప్రజ్జీవి.

''మనకు కావలిసినది బలవంతుల మైత్రి. మిత్రుల అండకోరటం తప్పు కాదు. అన్నిటినీ నాశనం చేయగల నిప్పు కూడా గాలి సహాయం వద్దనదు. అయితే మనం మనస్థావరాన్ని అంటిపెట్టుకుంటేనే గాని ఇతరుల మైత్రి మనకు లభించదు. మన బలం చూసినమీదటనే ఇతరులు సహాయపడతారు. కార్చిచ్చుకు సహాయపడే గాలి, అల్పమైన మంటలను ఆర్పేస్తుంది గదా!'' అన్నది చిరంజీవి.

ఇలా మంత్రులు తమ తమ అభిప్రాయాలు చెప్పిన మీదట కాకిరాజు మేఘవర్ణం, స్థిరజీవితో, "మహాశయా, వృద్ధుడివి, ప్రాజ్ఞుడివి. మంత్రులు తమ అభిప్రాయాలు చెప్పారు. అవి విన్నమీదట నీ అభిప్రాయం ఏమిటో చెప్పు,'' అన్నది.



# 184. కాంస్యయుగపు సస్యదేవత

మానవులు పాశవికదశ నుంచీ, సంచార జీవితం నుంచీ వ్యవసాయ జీవితానికీ, స్థిరనివాసాలకు మారిన దశలో సస్యదేవతలపూజ సాగింది. సిరియాలో "రస్ షమ్రా" వద్ద గల రాచసమాధులలో ఈ అందమైన దంతపు బొమ్మ దొరికింది. ఇది ఏ నగల పెట్టెకో మూతగా ఉపయోగపడినట్టు కనబడుతుంది.





# మాయాసరోవరం

## 16

[జయశీలుడు వదిలిన బాణం నరవానరానికి తగలగానే, కృపాణజిత్తు కొండగుట్ట దిగువకు చూసి, ఆ బాణం వదిలినవాడు తన శత్రువైన జయశీలు డని గుర్తించాడు. ఆ వెంటనే అతడు గడెకొండ అనుచరులతో కలిసి, వాళ్ళ గూడెం కేసి పారిపోయాడు. గడెకొండ అతణ్ణి హేళన చేయగా, కృపాణజిత్తు తన నరవానరాన్ని అతడిపైకి ఉసికొల్పాడు. తరవాత—]

గడెకొండ అనుచరులు ఆయుధాలెత్తి పట్టుకుని తన మీదికి రావటం చూసి, కృపాణజిత్తు భయకంపితుడయ్యాడు. వాళ్ళెంత మరుగుజ్జులైనా, తాను ఒంటరి గాడు! తమ నాయకుడి రక్షణ కోసం వాళ్ళు చావటానికైనా సిద్ధంగా వున్నట్టు కనిపించారు.

కృపాణజిత్తు చప్పున ఒక నిశ్చయానికి వచ్చి, చిరునవ్వు నవ్వుతూ తనను చుట్టు ముట్టుతున్న మరుగుజ్జుల కేసి చూసి, "తొందరపడకండి. నేను మీ మిత్రుణ్ణి. నరవానరాన్ని నే నెంత బాగా మచ్చిక చేశానో మీ నాయకుడికి చూపేందుకు, అతణ్ణి పట్టుకోమన్నాను," అంటూ వానరం చేతుల్లో వున్న గడెకొండను విడిపించాడు.

గడెకొండ ప్రాణభయంతో వణికి పోతూ, దూరంగా వున్న ఒక గుడిశె



ముందుకు పోయి, అక్కడ వున్న ఎండు మోడు మీద కూర్చున్నాడు. అతడి అనుచరులందరూ అతడి చుట్టూ చేరి, యిప్పుడేం చేయమంటావని అడిగారు. ఎక్కడినుంచో వచ్చిన యీ మహాకాయుడి సహాయం కోరి, తాను మొదటికే ముప్పు తెచ్చుకున్నానని. ఆ సరికి గడెకొండ గ్రహించాడు.

అతడు తలఎత్తి తన అనుచరులందరి కేసి ఓసారి చూసి. చిన్న గొంతుతో, "ఒరే, నే చెప్పేది జాగ్రత్తగా వినండి. ఆ ఏనుగు శరీరం వాడు, తన వానరం పక్కనే నిలబడి, మనం ఏం చేయబోతున్నామా అని గుడ్లు మిటకరించి చూస్తున్నాడు. వాడితో ముఖాముఖి కలబడి మనం జయించలేం. వాడి నుంచి, ఆ వానరాన్నీ, కత్తినీ వేరు చేయాలి. అప్పుడు మనలో కొందరం చచ్చినా, వాణ్ణి చంపి పీడ విరగడ చేసుకోవచ్చు." అన్నాడు.

"బాగానే వుంది. మరి ఉపాయం ఏమిటి?" అని అడిగాడొక మరుగుజ్జు.

"ఈ మహాకాయుడు చచ్చిం తరవాత గడెకారిరాణి మనందర్నీ తేలిగ్గా నాశనం చేయగలుగుతుందే! ఇప్పుడా దుర్మార్గురాలికి ఇద్దరు రాక్షసుల్లాంటి వాళ్ళు సాయం కూడా వున్నారు." అన్నాడు మరొక మరుగుజ్జు.

గడెకొండ ఆ ప్రశ్నించిన వాళ్ళ కేసి కోపంగా చూస్తూ, "ఒకవేళ చావు తప్పక పోతే మన జాతివాళ్ళ చేతుల్లోనే చద్దాం. అంతేకాదు—మనమంతా గడెకారి రాణి దగ్గిరకు పోయి, యిక నుంచి విధేయులుగా వుండి సేవ చేస్తామంటే, ఆమె మనను క్షమించకపోదు," అన్నాడు.

"ఆ పని యిప్పుడే చేద్దాం, పదండి!" అంటూ ఒకడు పెద్దగా గొంతెత్తి అరిచాడు.

గడెకొండ అందుబాటులో వున్న కర్ర తీసుకుని ఆ అరిచినవాణ్ణి ఒక్క బాదు బాదాడు. దూరంగా వుండి అంతా చూస్తున్న కృపాణజిత్తు. గడెకొండ తన

అనుచరులతో ఒక్కసారిగా వచ్చి తన మీద పడాలని పథకం వేస్తున్నాడని అనుమానించి, నరవానరాన్ని తాడుతో లాక్కుంటూ వాళ్ళ దగ్గిరకు వస్తూ, "ఇప్పుడు మీరు చేస్తున్న కుట్ర ఏమిటి? హఠాత్తుగా వచ్చి మీదపడి, నన్ను చంపాలని చూస్తున్నారా? నిజం చెప్పండి!" అంటూ పళ్ళు కొరికాడు.

గడెకొండ తన అనుచరులందరినీ నిశ్శబ్దంగా వుండమన్న సూచనగా చేయి ఊపి, ఎండుమోడు మీద లేచి నిలబడి, "అయ్యా, మహాకాయా! మేం చేస్తున్న కుట్ర మరేం లేదు. ఇప్పటి పరిస్థితి ఎలా వున్నదంటే, అటు గడెకారి రాణి గాని, కావాలనుకుంటే మీరుగాని, మా అందర్నీ క్షణాలమీద హతమార్చ గలరు. అందుకని, సూర్యాస్తమయానికి ముందే, యీ గూడెం వదిలి, దూరంగా అరణ్యంలో ఎక్కడికైనా పారిపోదామనుకుంటున్నాము," అన్నాడు.

గడెకొండ యిలా అనగానే, కృపాణజిత్తు బెదిరిపోయాడు. అతడికి యీ గూడెం చేరే ముందు అరణ్యంలో ఒంటరిగా పడిన బాధలన్నీ గుర్తుకువచ్చినై. ఈ సమయంలో, ఎంత అల్పులైనా యీ మరుగుజ్జుల సాయం లేకపోతే, తన ప్రబల శత్రువైన జయశీలుడు తేలిగ్గా తనను, యీ అరణ్యాల్లో, కొండల్లో వేటాడగలడు!

కృపాణజిత్తు యిలా ఆలోచించి, గడెకొండతో ఎంతో మర్యాదగా, "గడెకొండా,






నీకు నా నుంచి మేలు తప్ప, ఏ నాడూ కీడు జరగదు. నీ శత్రువైన రాణినీ, ఆమెకు సహాయం వచ్చిన నా శత్రువులిద్దర్నీ, తిరిగి సూర్యోదయం లోపల ఆ పరలోకానికి పంపుతాను. ఇవ్వాళ నడిరాత్రి వేళ, మీలో కొందరు నాకు సాయంగా వచ్చి, ఆ రాణీ వుండే గూడేనికి ముందుండి దారి తీయండి. నీ నా శత్రువులందర్నీ, నిద్రలో వున్న వాళ్ళను నిద్రలో వుండగానే నేనూ, నా నరవానరం కాలరాచేస్తాం. తరవాత నువ్వు, కంటికానేంత దూరంలో వున్న కొండలకూ, అరణ్యాలకూ రాజువు; తెలిసిందా? జై, గడెకొండ మహారాజుకూ!'' అని కేకపెడుతూ, నరవానరాన్ని కత్తిపిడితో గట్టిగా కొట్టాడు.

నరవానరం బాధతో, కోపంతో పెద్దగా అరిచి, కోరల్లాంటి తన పళ్ళను బయట పెట్టి, కృపాణజిత్తును వడిసి పట్టుకునేందుకు చేయి చాపబోయి, అతడి చేతిలోని కత్తి చూసి చప్పున ఒకడుగు వెనక్కు వేసింది.

గడెకొండ తృప్తిగా తలాడించి, "అయ్యా మహాకాయా! మీరు, మీ పెంపుడు వానరాన్ని మరి కాస్త దయగా చూస్తే, అది మధ్య మధ్య మీ పైన ఎదురు తిరక్కుండా వుంటుంది.'' అన్నాడు.

''ఈ సేవక జంతువును దయగా చూడటమా? ఛీ, ఛీ! అలాఅయితే అది క్షణాల మీద నాకు యజమానైపోతుంది. ఈ లోకంలో దెబ్బకు భయపడని ప్రాణి అంటూ ఏమీ లేదు. సరే, మా ఇద్దరి ఆహారం మాటేమిటి? నేను, నా కుటీరానికి పోతున్నాను,'' అంటూ కృపాణజిత్తు బయలుదేరాడు.

''అంతా అక్కడ సిద్ధంగా వున్నది,'' అన్నాడు గడెకొండ.

కృపాణజిత్తు, గూడెంలోని తతిమ్మా ఇళ్ళకు కొంచెం ఎడంగావున్న తన నివాస స్థానాన్ని సమీపించి, వెనుదిరిగి పెద్ద గొంతుతో, ''సూర్యుడస్తమించే వరకూ,

నా కెవ్వరూ నిద్రాభంగం కలిగించకండి. రాత్రల్లా మేలుకునుండవలసి వస్తుంది. సరిగా నడిరేయి శత్రుసంహారం!" అన్నాడు.

గడెకొండ యీసారి మరింత తృప్తిగా తలాడించి, "ఆ నరవానరం, వాణ్ణి ప్రమాద సమయంలో ఆదుకోదు; తప్పక పారిపోయి తీరుతుంది. ఇక వాడి కత్తి సంగతి; దాన్ని ముందుగా మనం లాగేసుకోవాలి," అని చుట్టూచేరిన అనుచరులకు చెప్పి, వాళ్ళల్లో నమ్మకస్తులూ, ధైర్యవంతులూ అయిన నలుగురిని, తన గుడిశెకు తీసుకుపోయాడు.

ఆ తరవాత రెండు మూడు గంటల కాలంగడిచిపోయింది. బాగాతిని గుడిశెలో గురకపెట్టి నిద్రపోతున్న కృపాణజిత్తు, హఠాత్తుగా నిద్రమేల్కొని, "ఏమిటబ్బా, యీ నూనెవాసన ?" అంటూ చుట్టూ కలయచూసి, "ఎవడ్రా బయట! ఏదో కుళ్లిన ఆముదం వాసన వస్తున్నదేమిటి ?" అంటూ కేకపెట్టాడు.

ఆ వెంటనే బయటినుంచి, "అయ్యా మహాకాయా ! అది ఆముదం వాసన కాదు; వేప చమురుతో మేలిమి బంగారంలాటి తెల్లనువ్వుల నూనె కలిసిన చమురు వాసన. క్రిమికీటకాలూ, దోమలూ రాత్రి వేళ తమకు నిద్రాభంగం కలిగించకుండా వుండేందుకు, మా నాయకుడు తమ కుటీ



రాన్ని కప్పిన తాటిఆకుల్ని, యీ నూనెతో తడపమన్నాడు," అని ఒక గడెకొండ అనుచరుడు జవాబిచ్చాడు.

"అలాగా! మంచిది, మంచిది," అంటూ కృపాణజిత్తు పెద్దగా ఆవులించి, తిరిగి కళ్ళు మూసుకున్నాడు. గుడిసె మధ్య వున్న గుంజకు బలమైన ఇనుప గొలుసుతో బంధించబడిన నరవానరం మాత్రం, ఆ వాసనను భరించలేక, గొలుసును తెంచుకుని పారిపోయే ప్రయత్నంలో అటూ యిటూ గిరికీలుకొడుతూ గింజుకో సాగింది.

కృపాణజిత్తు ఒళ్లుమరిచి నిద్రపోతున్న గుడిసె ముందుకు గడెకొండ కొందరు



అనుచరులతో వచ్చాడు. తమ నాయకుడు సైగచేయగానే ఒక మరుగుజ్జు నిశ్శబ్దంగా గుడిశె ద్వారం తెరిచి లోపలికి పోయి, కృపాణజిత్తు గోడకు ఆనించిన కత్తిని తీసుకుని బయిటికి వచ్చేశాడు.

గడెకొండ ఆ కత్తిని అటూ యిటూ తిప్పిచూసి, ''ఆ మహాకాయుడి నిద్ర మత్తు గుడిసె కాలి మీద పడితేగాని వదలదు. ఈ కత్తిని మనం మోయగలమేమో కాని, ఆయుధంగా ఉపయోగించలేం. దీన్ని ఎక్కడైనా దాయండి,'' అని తిరిగి కత్తిని తన అనుచరుడికిచ్చాడు.

ఆ తరవాత ముందు వేసిన పథకం ప్రకారం గడెకొండ అనుచరులు బళ్ళాలు పట్టుకుని అక్కడికి వచ్చారు. వాళ్ళల్లో కొందరు పొట్టేలురౌతులు కూడా వున్నారు. గడెకొండ అందరికేసీ ఓమారు చూసి, ''ఇక మన చావో, ఆ దుర్మార్గుడైన మహాకాయుడి చావో తేలిపోవాలి. గుడిశెకు అన్నివైపులా నిప్పు పెట్టండి. వాడు ప్రాణాలతో బైటికి వస్తే, బళ్ళాలతో పొడవండి. నరవానరం బహుశా ఇనపగొలుసు తెంచుకుని బయిటికి రాలేదు, అది అక్కడే మంటల్లో కాలి చస్తుంది!'' అన్నాడు.

తమ నాయకుడిలా అనగానే మరుగుజ్జు భటుల్లో నలుగురు మండుతున్న కాగడాలు తీసుకుపోయి గుడిశెకు అన్నివైపులా నిప్పు పెట్టారు. బాగా చమురుతో తడిసి వున్న తాటి ఆకుల గుడిసె, ఒక్కసారిగా భగ్గుమంటూ ముట్టుకుని, పెద్ద పెద్ద మంటలు పైకిలేచినై.

ఒకటి రెండు క్షణాలు గడిచే లోపలే నిద్రపోతున్న కృపాణజిత్తుకు శరీరమంతా భగ్గుమన్నట్టయి మెలుకువ వచ్చింది. అతడు కళ్ళు తెరిచి చూస్తూనే, తానున్న గుడిసె కాలిపోతున్నట్టు గ్రహించి, ప్రాణభయంతో ఒక్క చావుకేకపెట్టి, "మోసం! మోసం! ఇందుకు ప్రతీకారం చేస్తాను!" అని గంతులు వేస్తూ, తన కత్తి కోసం గోడ కేసి చూశాడు. కత్తి వుండవలసిన చోట లేదు.

కృపాణజిత్తు వడవడ వణికిపోతూ ఏమి చేయటమా అని ఆలోచించేలోపలే, కాలిన తాటి ఆకు ఒకటి కప్పుమీది నుంచి జారి అతడి మీద పడింది. నరవానరం భీకరంగా ఒక్క అరుపు అరిచి, బలంగా గుంజేసరికి, దాని నడుముకు కట్టి వున్న ఇనుప గొలుసు తెగిపోయింది. అది కృపాణజిత్తును పట్టుకోబోయినదల్లా, చుట్టూ కమ్ముకు వస్తున్న మంటలకు బెదిరి, బంధించి వున్న గుడిశె ద్వారం కేసి పరిగెత్తింది.

ఇక తనకు చావు తప్పదన్న భయంతో కృపాణజిత్తు సాహసించి నరవానరం నడుమునుంచి వేళ్ళాడుతున్న ఇరిగిన ఇనుప గొలుసును పట్టుకున్నాడు. వానరం ఒక్క ఊపునపోయి, ద్వార బంధాలను విరగకొట్టి, బయిటికి దూకింది. కృపాణజిత్తు కూడా దాని నడుము నుంచి వేళ్లాడుతూ పోయి గుడిశె ముందు బోర్లా పడిపోయాడు. ఆ సమయంలో ఇనుప గొలుసు అతడి చేతి పట్టునుంచి జారి పోయింది.

హఠాత్తుగా నరవానరం, దాని వెనకగా కృపాణజిత్తూ కాలుతున్న గుడిసె నుంచి ప్రాణాలతో బయటపడటం చూసి గడెకొండా, అతడి అనుచరులూ భయకంపితులైపోయారు. కాని, యిప్పుడు కృపాణజిత్తు నిరాయుధుడు; నరవానరం వీలు దొరికితే అరణ్యాల్లోకి పారిపోయేందుకు ఎప్పుడూ ప్రయత్నిస్తూనే వున్నది!



గడెకొండ చప్పున ధైర్యం తెచ్చుకుని, పారిపోజూస్తున్న తన అనుచరులను హెచ్చరిస్తూ, "ఒరే, నరవానరాన్ని దాని దారిన దాన్ని పోనియ్యండి. ఈ దుర్మార్గుణ్ణి మాత్రం వదలకండి, బల్లాలతో పొడవండి," అంటూ కేకపెట్టాడు.

మరుగుజ్జుభటులకు తమ నాయకుడి హెచ్చరికతో కాస్త గుండెనిబ్బరం కలిగింది. కాని, అంతలో నరవానరం పెద్దగా అరుస్తూ పోయి మరుగుజ్జుభటులను అందినవాళ్ళను అందినట్టు పట్టుకుని, అటూ యిటూ విసిరివేయసాగింది. వాళ్ళల్లో కొందరు అక్కడినుంచి పారిపోయేందుకూ, మరికొందరు తెగించి నరవానరాన్ని బల్లాలతో పొడిచేందుకూ ప్రయత్నించసాగారు.

ఈ గందరగోళం కృపాణజిత్తుకు మంచి అవకాశం కలిగించింది. అతడు ఏదైనా ఆయుధం దొరుకుతుందా అని చుట్టూ కలయచూసేసరికి, ఒకచోట పొడవాడి ఎండుచెట్టు కొమ్మ కనిపించింది. అతడు చప్పున దాన్ని చేతికి తీసుకుని, భీకరంగా ఒక కేకపెటి, పోయి గడెకొండ అనుచరులను ఎడా పెడా కొట్టసాగాడు.

గడెకొండా, అతడి మరుగుజ్జులు కూడా ప్రాణాలకు తెగించి, సాహసంతో కృపాణజిత్తును ఎదుర్కొని తమ బల్లాలతో గాయపరచసాగారు.

మరుగుజ్జువాళ్ళ గూడెంలో రేగుతున్న మంటలూ, పొగతోపాటు; అక్కడినుంచి వస్తున్న అరుపులూ, కేకలూ—దాపులనున్న అరణ్యంలో ఇద్దరు వింతమనుషులు విన్నారు. వాళ్ళు గుర్రాల రూపంలో వున్న రెండు అద్భుత జంతువులను ఎక్కివున్నారు. ఆ జంతువుల శరీరాలు చేప పొలుసుల లాంటి పొలుసులతో కప్పబడివున్నవి. చూడగా వాటి లక్షణాలు మకరకేతు వాహనమైన జలగ్రహాన్ని పోలివున్నవి. రౌతులిద్దరూ సొరచేప చర్మంతో కుట్టిన దుస్తులు ధరించి వున్నారు. వాళ్ళ నడుముల నుంచి పొడవాటి కత్తులు వేళ్ళాడుతున్నవి. —(ఇంకావుంది)





# దేశాటన

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీకు ఈ శ్రమతో కూడిన పని పెట్టినవాడు నీ తండ్రి కాదుగద? ఎందుకంటే, కొందరు తండ్రులు తమ కొడుకులను అష్టకష్టాలకు గురిచేస్తేనేగాని తృప్తిపడలేరు. అందుకు నిదర్శనంగా నీకు కళింగరాజయిన గుణశేఖరుడి కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అని ఇలా చెప్పసాగాడు:

కళింగరాజ్యాన్ని పాలించిన గుణశేఖరుడికి ఒక్కడే కొడుకు. అతని పేరు రాజశేఖరుడు. రాజశేఖరుడు యుక్త వయసు వచ్చేసరికి అన్ని విద్యలలోనూ ఆరితేరాడు. అతని జ్ఞానం పరిపూర్ణ

బేతాళ కథలు



మయిందని గురువులు ఒప్పుకున్నారు. ఆ జ్ఞానానికి తగిన అనుభవం కూడా ఉంటే, తన కొడుకు రాణించగలడన్న ఉద్దేశంతో గుణశేఖరుడు తన కొడుకును దేశాటన చేసి రమ్మన్నాడు.

తండ్రి మాటప్రకారం రాజశేఖరుడు ఒంటరిగా బయలుదేరి, తూర్పు దిక్కుగా ప్రయాణమై వెళ్ళాడు. రాజు అతని వెనకగా తన చారులను పంపి, అవసరమైతే వాళ్ళు రాజశేఖరుడికి సహాయపడేటట్టు ఏర్పాటు చేశాడు. కాని ఈ సంగతి రాజశేఖరుడు ఎరగడు.

అతను కొత్త ప్రదేశాలూ, కొత్త కొత్త ప్రకృతిదృశ్యాలూ చూసుకుంటూ, ఒక రోజు చీకటి పడేవేళకు అరణ్యప్రాంతానికి వచ్చాడు. అతను ఏమి చెయ్యటమా అని ఆలోచిస్తూండగా అస్పష్టంగా మూలుగు వినబడింది. అతను ఆ దిశగా వెళ్ళి, భూగర్భంలోకి ఎగుడు దిగుడుగా మెట్లు ఉండటం చూశాడు. అతను వాటి వెంబడి దిగిపోతే, ఒక పాతాళభైరవి విగ్రహమూ, దానికి ఎదురుగా స్తంభానికి కట్టి ఉన్న ఒక సుందరీ కనిపించాయి. మూలుగుతున్నది ఆ సుందరే!

"ఎవరు నువు? నిన్నిక్కడ ఎవరు కట్టేశారు?" అని రాజశేఖరుడు సుందరిని అడిగాడు.

"నేను మాళవదేశపురాజు కుమార్తెను. నా పేరు మణిమాల. ఒక మాంత్రికుడికి ఒక కూతురు ఉండేది. ఆమె చనిపోయింది. ఆమె జన్మనక్షత్రాననే పుట్టిన కన్యను ఈ మహాకాళికి బలిఇస్తే తన కూతురు బతుకుతుందన్న నమ్మకంతో మాంత్రికుడు, అదే నక్షత్రాన పుట్టిన నన్ను తెచ్చాడు. ఈ రాత్రికి నన్ను బలి ఇయ్యబోతాడు," అన్నది ఆమె.

"నీ కేమీ భయం లేదు. నేను నిన్ను రక్షించటమేగాక, ఆ మాంత్రికుడి భయం శాశ్వతంగా దూరం చేస్తాను," అని రాజశేఖరుడు మరొక స్తంభం చాటున దాక్కున్నాడు.



కొంతసేపటికి మాంత్రికుడు వచ్చి, దేవీవిగ్రహం ముందు కూర్చుని, మంత్రోచ్చాటన ప్రారంభించాడు. రాజశేఖరుడు తన కత్తి దూసి, స్తంభం చాటు నుంచి వచ్చి, మాంత్రికుడి తల నరికేశాడు. తరవాత అతను మణిమాల కట్లు విప్పి, ఆమెను తన గుర్రం మీదనే ఎక్కించుకుని మాళవదేశానికి వెళ్ళాడు.

మాళవరాజు రాజశేఖరుడికి తన కృతజ్ఞత తెలుపుకుని, మణిమాలను అతనికి ఇచ్చి, వైభవంగా పెళ్ళి చేశాడు. తరవాత రాజశేఖరుడు భార్యా సమేతంగా తన దేశానికి తిరిగివచ్చి, తండ్రికి జరిగినదంతా చెప్పాడు. గుణశేఖరుడు సంతోషించాడు.

కొద్ది కాలం గడిచింది. గుణశేఖరుడు రాజశేఖరుణ్ణి పిలిచి, "నీ దేశాటనతో నేను అంతగా తృప్తిపడలేదు. మరొకసారి నువు దేశాటన చేసిరా," అన్నాడు.

ఈసారి రాజశేఖరుడు పడమరగా బయలుదేరాడు. ఈసారి కూడా అతనికి తెలియకుండా అతని వెనకగా రాజు పంపిన చారులున్నారు.

ఈ ప్రయాణంలో రాజశేఖరుడికి ఎండిపోయి, బీటలుపడిన పొలాలూ, ఎముకలగూళ్ళులా గున్న మనుషులూ కనబడటం జరిగింది. అతను చాలా బాధపడ్డాడు. గుంపులు, గుంపులుగా వలస పోతూ జనం అతనికి ఎదురై, తమ దేశంలో క్షామం తాండవిస్తున్నదనీ, దానికి తోడు కర్కోటకుడైన రాజు తమను పన్నులతో పీడిస్తున్నాడనీ చెప్పారు. రాజశేఖరుడు మరి కొంత దూరం వెళ్ళి, ఒక గ్రామం చేరి, అక్కడి రైతులను రాజ సైనికులు, గ్రామ మధ్యంలో మందవేసి, పన్నులు కట్టలేదని హింసించటం కళ్ళారా చూశాడు.

రాజశేఖరుడికి పట్టరాని కోపం వచ్చింది. అతను ఆ దేశపు రాజును కలుసుకుని, అతని పరిపాలనను తీవ్రంగా ఖండించాడు.

మూర్ఖుడైన ఆ రాజు రాజశేఖరుణ్ణి పట్టి బంధించాడు. ఈ వార్త చారుల ద్వారా గుణశేఖరుడికి తెలిసింది. వెంటనే ఆయన పెద్ద సేనను వెంటబెట్టుకుని వచ్చి, ఆ రాజును సంహరించి, రాజశేఖరుణ్ణి చెరవిడిపించి, ఆ దేశానికి మంచి పరిపాలన ఏర్పాటుచేశాడు.

తరవాత ఆయన తన కొడుకు చేసిన రెండవ దేశాటన పట్ల తన సంతృప్తి ప్రకటించి, అతన్ని యువరాజుగా అభిషేకించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. గుణశేఖరుడు తన కొడుకు చేసిన మొదటి దేశాటన పట్ల ఎందుకు తృప్తిచెందలేదు? అది సుఖంగా జరగటమేగాక, రాజశేఖరుడికి చక్కని భార్యను కూడా ప్రసాదించిందిగదా? అంతకన్న అతన్ని అష్టకష్టాలకూ గురిచేసిన రెండో దేశాటన ఆయనకు ఎందుకు తృప్తి కలిగించింది? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల బద్దలవుతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు తన కొడుకును దేశాటనకు పంపినది సుఖప్రయాణం చెయ్యటానికీ, భార్యను సంపాదించుకోవటానికీ కాదు; రాజు కాబోయేవాడికి అత్యవసరమైన అనుభవం సంపాదించగలందులకు. రాజశేఖరుడు చేసిన మొదటి దేశాటనలో అలాటిది ఏమీ జరగలేదు. అందులో అతనికి కలిగిన అనుభవాలు కేవలమూ వ్యక్తిపరమైనవి. కాని రెండో దేశాటనలో అతనికి కలిగిన అనుభవం విలువగలది. అతను ప్రజల బాధలు చూడటమేగాక, వాటిని గురించి మంచి పాలకుడు ప్రదర్శించవలసిన వైఖరి ప్రదర్శించాడు. అందుకే అతని తండ్రికి ఆ దేశాటన తృప్తి కలిగించింది." అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# భూదానం

ఫుల్‌పుర గ్రామం వెలపల బీడుపడి పోయిన పెద్ద మైదానం లాంటి భూమి ఉండేది. అది శాపంపొందిందనే వారు. ఎందుకంటే ఒకప్పుడు ఆ భూమిలో బంగారం పండేది. ఒకసారి అటుగా వరద నీరు వచ్చింది. ఆ తరవాత అది బీడువేసి పోయి, వ్యవసాయయోగ్యం కాకుండా పోయింది. అందులో చల్లిన విత్తనాలు మొలకలైనా ఎత్తలేదు. కొంతకాలానికి అక్కడ పిచ్చి మొక్కలూ, తుప్పలూ లేచాయి.

ఆ భూమి ఆ గ్రామంలో ఉండే రఘురాం అనేవాడిది. అతను ధనికుడే గాని, కాపీనం గల మనిషి; చూస్తూ, చూస్తూ ఎవరికీ ఏదీ ఇయ్యలేడు.

ఆ గ్రామంలోని ధనికరైతు కొడుకు, రతన్ అనేవాడు, కృషిశాస్త్రం చదువుకుని గ్రామానికి తిరిగివచ్చాడు. బీడుభూమిని చూసినప్పుడల్లా అతని ప్రాణంపీకేది. అంత భూమి ఊరికేపడిఉండటం అతను సహించలేకపోయాడు. ఇళ్ళస్థలాలుగా ఉపయోగింతామన్నా గ్రామంలో ఇళ్ళు లేక బాధపడేవాళ్ళు లేరు. ఏవిధంగానైనా ప్రయత్నించి, ఆ బీడు భూమిని, సాగు భూమిగా మార్చాలి.

రతన్ ఆ భూమిలోని మన్ను తీసుకుపోయి పరీక్షచేయించి, అందులో ఒకరకం రసాయనం లోపించిందనీ, దాన్ని ఎరువుతో చేర్చి చల్లితే ఆ భూమి మామూలుగా పండుతుందనీ తెలుసుకున్నాడు. ఆ భూమిని ఎలాగైనా రఘురాం నుంచి దానం పుచ్చుకుని, గ్రామంలోని పేద రైతులకు పంచాలని అతనికి ఆలోచన కలిగింది.

అయితే రఘురాం ఏదీ దానం చేసే మనిషి కాదు. ఆ పొలం పట్టి చవుడు

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

పత్ర అయినా కూడా దాన్ని అతను ఇచ్చెయ్యడు. కాని అతని మూఢత్వాన్ని ఆధారంచేసుకుని, అతన్ని లొంగదీయాలి. అందుకు సహాయపడగలవాడు పట్నంలో ఉండే దేబాశీస్ అనేవాడు అతగాడికి ఇంద్రజాలం తెలుసు. అతను రతన్ స్నేహితుడు. అతన్ని అడిగితే, రఘురాంను దారికి తీసుకురావటానికి ఒక తంత్రం చెప్పాడు.

ఒకరోజు ఉదయం రతన్ రఘురాం ఇంటికి వెళ్లి, క్షేమసమాచారాలు అడిగాడు.

"అంతా కులాసాగానే ఉన్నాంరా, బాబూ. దానికేంగాని, ఇంత పెందలాడి వచ్చావు, ఏమిటి విశేషం?" అని రఘురాం అడిగాడు.

"నీ బీడు గురించి ఒక చిత్రమైన కల వచ్చింది. పంటల దేవత అయిన మహాలక్ష్మి కనిపించి, నాకో వరం ఇచ్చింది. తన పేరు పదిసార్లు ఉచ్చరించి నేను ఏ పొలంలో మట్టి మీద ఊదినా ఆ పొలం చక్కగా పండుతుందిట. ఆమె నాతో అన్నదిగదా, 'రఘురాం దగ్గిరికి వెళ్ళి, ఈ అద్భుతం ప్రదర్శించి, అతడి బీడు భూమి దానంగాపుచ్చుకుని, పేదరైతులకు పంచిపెట్టు. నువు అద్భుతంచేసి చూపించి నాక కూడా భూమిని నీకు ఇయ్యక పోయాడో, నేను శాపంపెట్టి, అతని పొలాలన్నీ బీడుపడేలాగా చేస్తాను. అతని డబ్బు యావత్తూ బూడిద అయిపోతుంది. అతని పశువులన్నీ చచ్చిపోతాయి. అతను



బతుకుతెరువుకు పడేపాట్లు కుక్కలూ, నక్కలూ పడవు.' అన్నది.'' అన్నాడు రతన్ రఘురాంతో.

రఘురాం అంతా శ్రద్ధగావిని, "ఇంతకూ నువు చెప్పేఆ అద్భుతం ఏమిటి, బాబూ?" అన్నాడు.

''దాని సంగతి నా కింకా స్పష్టంగా తెలీదు. ఇవాళ సాయంకాలం కొంత పూజా అదీ చెయ్యాలి. అప్పుడు వివరాలు తెలిసే అవకాశం వుంది. ముందు యీ సంగతి చెప్పు, దేవత చెప్పినట్టు చేస్తావా?" అని రతన్ అడిగాడు.

''నీ అద్భుతంతో నాకు నమ్మకం కలిగిస్తే దేవత చెప్పినట్టే చేస్తాను.'' అన్నాడు రఘురాం.

ఆ సాయంకాలం రతన్ కొందరు పేద రైతులను వెంటబెట్టుకుని రఘురాం ఇంటికి వచ్చాడు. అతను తన జేబులో నుంచి ఒక పలకలగ్లాను పైకితీసి, దాన్ని గదిలో ఒకమూల బల్ల మీద పెట్టాడు. తరవాత అతను, ''ఎవరైనా వెళ్ళి, బీడు నుంచి పిడికెడు మట్టి తీసుకురండి,'' అన్నాడు.

రఘురాం కొడుకు ఒకడు వెళ్ళి మట్టి తెచ్చాడు. రతన్ దాన్ని గ్లాసులో పోసి, గ్లాసు మీద చేతిరుమాలు కప్పి, బల్లకు ఎదురుగా చేతులు జోడించి కూర్చుని, కళ్ళుమూసుకుని ధ్యానంచేశాడు. తరవాత అతను కళ్ళుతెరిచి, గ్లాసు మీదినుంచి రుమాలు తీసేశాడు. అద్భుతం! ఇప్పుడు



గ్లాసు నిండా మట్టికి బదులు ధాన్యం ఉన్నది!

''మహాలక్ష్మి మాతకూ జై!'' అని రైతులు అరిచారు.

రఘురాం ముఖంలో ఆశ్చర్యమూ, భయమూ కనిపించాయి. అతను చలించే కంఠంతో, ''మిత్రులారా, ఆ దిక్కుమాలిన బీడును మీ కిచ్చేస్తాను. కాగితం తీసుకు రండి. సంతకం పెట్టేస్తాను,'' అన్నాడు.

సెంటు పొలం లేని రైతులకు భూవసతి ఏర్పడింది. రతన్ చందాలు పోగుచేసి, సహకార ఋణాలు పుట్టించి, సమిష్టి వ్యవసాయానికి కావలసిన హంగులన్నీ అమర్చాడు. ఆ బీడులో రైతులందరూ కలిసి శ్రమపడి బంగారం పండించారు. ఫలసాయం అందరికీ సమంగా ముట్టింది. గ్రామంలో అదిచూసి సంతోషించారు. ఒక్క రఘురాం మాత్రమే ముఖం మాడినట్టు కనిపించాడు.

ఇంతకూ, మట్టిని ధాన్యంగా మార్చటానికి రతన్ చేసిన ఇంద్రజాలం ఏమిటి?

అతను ఉపయోగించిన పలకలగ్లాసు మామూలు గ్లాసు కాదు. దాని మధ్య భాగంలో అద్దపు పలకలు అమర్చి ఉన్నాయి. వాటితో గ్లాసు రెండు భాగాలుగా విభజించబడి ఉంటుంది. అద్దం పలకలలో ప్రతిబింబించేవైపు బయటికీ, ఎర్రటి మందు గల పక్కలు చేర్చి ఉంటాయి. ఈ అద్దంపలకలమూలంగా ఖాళీగ్లాసులోని రెండు అర్ధభాగాలూ పూర్తిగ్లాసులాగా కనబడతాయి. రతన్ ఆ గ్లాసు ఒక సగంలో ముందుగా ధాన్యం పోసి ఉంచి, అది గోడ కేసి పెట్టి, అందరికి కనిపించే సగంలో మట్టి పోశాడు. తరవాత చేతి రుమాలు తీసేటప్పుడు మట్టి ఉన్నభాగాన్ని వెనక్కు తిప్పేసి, చూసేవారికి ధాన్యం ఉండే భాగమే కనపడేలాగ చేశాడు. అద్దాల మూలంగా మట్టీ, ధాన్యమూ కూడా గ్లాసు నిండా ఉన్నట్టు చూసేవారికి భ్రమ కలిగింది. రతన్ ఉపయోగించినది పలకలున్న గ్లాసు కావటం భ్రమను మరింతచేసింది.



# సరిఅయిన పద్ధతి

వజ్రగిరి రాజైన వజ్రపాలుడు తన రాజ్యంలో ఎలాటి దుష్టులకూ, దుర్మార్గులకూ, అవినీతి పరులకూ చోటు ఉండరాదని నిర్ణయించి, అలాటి వారినందరినీ వెతికి పట్టుకుని, వారిని దేశం నుంచి పారదోలాడు. ఇలా ఒక సంవత్సరం చేసే సరికి దేశంలో ప్రతి కుటుంబం నుంచీ ఒకరో అరో దేశబహిష్కరణ పొందటం జరిగి, ప్రజలలో ఆందోళన బయలుదేరింది.

అప్పుడు కొందరు తెలివిగలవాళ్ళు రహస్యంగా సమావేశమై, రాజుగారి వైఖరి మార్చటానికి ఒక పథకం ఆలోచించారు. ఆ పథకం కింద, సరిహద్దు గ్రామాల నుంచి రోజూ రాజుగారికి ఫిర్యాదులు రాసాగాయి. చుట్టుపక్కల అరణ్యాల నుంచి పులులూ, సింహాలూ లాటి ఘాతుక మృగాలు పల్లెల మీద వచ్చిపడి ప్రజలను చంపేస్తున్నాయిట.

ఎన్నడూ లేనిది ఇలా ఎందుకు జరుగుతున్నదని రాజు అడిగితే, మంత్రి, "మహారాజా, అరణ్యాలలో ఉండే ఆటవికనాయకులు తమ పొలిమేరల నుంచి క్రూరమృగాలను తరిమేస్తున్నారు?" అన్నాడు.

"వాటిని శిక్షించాలి, లేదా అదుపులో ఉంచాలి గాని, ఇతర ప్రాంతాల మీదికి పంపకం చెయ్యటమేమిటి?" అన్నాడు రాజు.

"మన రాజ్యంలో మనం దుష్టులను ఇదేకదా చేశాం?" అన్నాడు మంత్రి. రాజుకు వెంటనే జ్ఞానం కలిగి, తన పద్ధతి మార్చుకున్నాడు.

—ఎం. మంజూరాణి.





# పాప్తం

రాజయ్య కోమటి గుమాస్తా. అతనికి కొత్తగా పెళ్ళి అయింది. ఒకరోజు అతను నిద్ర మేల్కొని, కళ్ళు తెరవగానే, పెరట్లో పూలు కోసుకుని లోపలికి వస్తున్న భార్య కనిపించింది.

''నిద్ర లేస్తూనే నీ మొహం చూశాను. ఈ రోజు ఎలా ఉంటుందో చూడాలి,'' అన్నాడు రాజయ్య.

ఆమె నవ్వి,''నిద్ర లేవగానే నా మొహం చూసిన వాళ్ళకు తప్పకుండా మంచే జరుగుతుంది. అందుకే మా నాన్న నిద్ర లేచినాక, నన్ను తన ఎదటికి పిలిచి మరీ కళ్ళు తెరిచేవాడు,'' అన్నది.

తన భార్య మాట ఎంతవరకు నిజమవు తుందో పరీక్షించి చూద్దామనుకున్నాడు రాజయ్య.

వాడు భోజనం చేసి, నేల మీదనే జాగ్రత్తగా చూసుకుంటూ కొట్టుకు వెళ్ళాడు. దారిలో వాడికి విలువైన వస్తువేదీ దొరకలేదు.

ఆ రోజు గొప్ప బేరం ఏదైనా తగులు తుందనీ, ఆ సంతోషంలో యజమాని తనకు మంచి బహుమానం ఏదైనా ఇస్తా డనీ రాజయ్య ఆశపడ్డాడు. కాని ఆ రోజు బేరాలు రోజూకన్న మందకొడిగా సాగాయి. యజమాని తన భార్యతో ఏదో జగడమాడి మహా చిరాకుగా ఉన్నాడు.

రాజయ్యకు మరొక ఆశ కలిగింది. పండగ దగ్గిరపడింది. రాజయ్య అంత క్రితం పండగకు అత్తవారింటికి వెళ్ళాడు గనక, ఈసారి మామగారు తనను పిలవక పోయినా, ఎవరైనా మనిషి ద్వారా తనకు విలువైన కానుక ఏదైనా పంపిస్తాడేమో ననుకున్నాడు.

చీకటిపడబోతుండగా రాజయ్య మామ గారి మనిషి రాజయ్య కోసం కొట్టు దగ్గిరికి

ఎం. కామేశ్వరరావు

రానేవచ్చాడు. అయితే వాడు కానుక తీసుకురాకపోగా, ''మీ అత్తా, మామా తీర్థయాత్రలకు పోతారుట. నిన్ను ఒక వంద సర్దమన్నారు,'' అని చెప్పాడు.

''నా దగ్గిర ఏముంది బూడిద!'' అని రాజయ్య అమిత కోపగించుకుని ఆ మనిషిని పంపేశాడు.

చీకటిపడిపోయింది. రాజయ్యకు మంచి ఏమీ జరగనేలేదు. ఆశలన్నీ నిరాశలయాయి. రాజయ్య ఉసూరుమంటూ ఇంటి దారి పట్టాడు.

బజారులో ఒక ముసలిది రాజయ్యకు ఎదురుపడి, ''ఎవరూ? రాజయ్య కాదూ?'' అన్నది, వాణ్ణి వీధి దీపం వెలుగులో పరికించి చూసి.

ఆ ముసలిదాన్ని చూడగానే రాజయ్య పైప్రాణాలు పైనేపోయాయి. ఆ ముసలిది రాజయ్యకు ఒకప్పుడు సన్నిహితురాలు. రాజయ్య తల్లీ, తండ్రీ వాడి చిన్నతనంలోనే పోగా, వాడు ఊళ్లుపట్టి తిరుగుతున్నప్పుడు, ఒక ఊళ్ళో ఈ ముసలిది వాడికి ఆశ్రయం ఇచ్చింది. అంతకుమునుపే దాని కొడుకు పోయాడట. వాడు అచ్చు రాజయ్యలాగే ఉండేవాడట.

''నిన్ను చూస్తుంటే నా కొడుకును చూస్తున్నట్టే ఉన్నది, నాయనా. నా తోనే ఉండు,'' అన్నది ముసలిది రాజయ్యతో.



ముసలిది పాలూ, పిడకలూ అమ్మి, ఆ డబ్బుతో ఇంత ఉడకేసి, ప్రేమగా రాజయ్యకు పెట్టుతూండేది. వాడు ముసలిదాని దగ్గిర రెండేళ్లు నిశ్చింతగా ఉన్నాడు. అయితే రానురాను ముసలిదానికి శక్తి ఉడిగిపోయింది. పాలు పితకటమూ, పిడకలు చెయ్యటమూ కూడా దాని శక్తికి మించిన పనులయిపోయాయి.

''నా ఆఖరిదశలో దేవుడే నిన్ను నా దగ్గిరికి పంపించాడు. నేను మంచాన పడితే నువే నాకు దిక్కు.'' అన్నది ముసలిది రాజయ్యతో.

ఆ మాటలు వినగానే రాజయ్యకు ముచ్చెమటలు పోశాయి. ఆ ముసలిది

తన ప్రాణానికి పీడలా దాపరించిందనుకుని వాడు, ఒక రాత్రికి రాత్రి ఆ ఇల్లు వదిలి పారిపోయి, ఇప్పుడున్న ఊరు వచ్చి, ఉద్యోగం సంపాదించి, పెళ్ళి చేసుకుని జీవితంలో స్థిరపడ్డాడు.

వాడు ముసలిదాన్ని వదిలినా, అది వాణ్ణి వదలక, మళ్ళీ సంవత్సరానికి ఇలా తారసిల్లింది. అది తన దగ్గిర ఉండిపోతానంటుంది కాబోలని భయపడ్డాడు రాజయ్య.

"బాబూ, రాజయ్యా, నన్ను గుర్తుపట్టలేదురా? నేను నీ పెంపుడు అవ్వను. చెప్పకుండా, చెయ్యకుండా వెళ్ళిపోయావుగదా, నేను ఎంత బాధపడ్డానురా! నీ కోసమే వెతుక్కుంటూ బయలుదేరాను. నా అదృష్టం కొద్దీ కనిపించావు. ఇంక ఈ ఘటం ఎంతో కాలం ఉండదు, నాయనా!" అన్నది ముసలిది, కన్నీళ్లతో.

రాజయ్య ఆమె పట్టుకున్న చెయ్యి విడిపించుకుంటూ, "ముసలితనంలో నీకు చూపు మందగించింది. మతి కూడా చలించినట్టున్నది. అసలు నా పేరు రాజయ్య కాదు. నేను నిన్ను ఎన్నడూ చూడనూ లేదు," అని, గబగబ ముసలి దాన్ని దాటుకుని వచ్చేశాడు.

వాడు ఇంటికి వస్తూనే భార్యతో, "నీ మొహం చూసినందుకు మంచి జరగకపోగా, ఎప్పుడో నాకు తెలిసిన ముసలిది నా వెంటబడి, నా ఇంట తిష్ఠ వెయ్యటానికి ప్రయత్నించింది. దాన్ని వదిలించుకుని కొంప చేరుకునేసరికి ఈవేళ అయింది," అన్నాడు చిరాకుగా.

"బాగుందే! ప్రాప్తం లేనప్పుడు నోటి దాకా వచ్చిన కూడు కూడా మట్టిపాలవుతుంది," అన్నది రాజయ్య భార్య.

ఈ మాట అక్షరాలా నిజం. ఎందుకంటే పెరట్లో ముసలిదానికి నిధి దొరికితే, ముసలిది పెంచిన ప్రేమకొద్దీ దాన్ని రాజయ్యకు ఇయ్యాలని ఊళ్ళ మీద వాణ్ణి వెతుక్కుంటూ వస్తే, అది ప్రాప్తం లేక రాజయ్య ముసలిదాన్ని కష్టపడి వదిలించుకుని వచ్చేశాడు.





# మాలిశ్ చేసేవాడు

ప్రచండ దేశాన్ని ఏలే ప్రభంజన మహారాజు సైన్యాధిపతి హటాత్తుగా చచ్చాడు. ఆ పదవికి కొత్తవాణ్ణి వేసుకోవాలి. అందుకు యోగ్యులైనవాళ్ళు నలుగురున్నారు. అందులో ఒకణ్ణి ఎలా ఎన్నిక చెయ్యాలో రాజుకు పాలుపోలేదు.

రాజుగారి మంగలి ఉదయంపూట వచ్చి, రాజుగారి శరీరానికి నూనె పట్టించి, మర్దన చేసి, స్నానం చేయించేవాడు. వాడికి రాజుగారు అప్పుడప్పుడూ తన సమస్యలను గురించి చెప్పేవాడు.

ఈసారి రాజు మంగలికి తన సమస్య గురించి చెప్పాడు. అంతా విని మంగలి, ''సైన్యాధిపతికి ఉత్త శక్తి సామర్థ్యాలు ఉంటే చాలదు. వల్లమాలిన రాజభక్తి ఉండాలి. దేవుడికి సేవచెయ్యటానికి ఎలా సిగ్గుపడడో, రాజును సేవించటానికి కూడా అలాగే సిగ్గుపడరాదు,'' అన్నాడు.

''ఇది ఎలా తెలుసుకోవాలి?'' అన్నాడు రాజు. మంగలి ఉపాయం చెప్పాడు.

రాజు సైన్యాధిపతి పదవి కోసం ఎదురు చూస్తున్న నలుగురికీ కబురు పంపాడు.

నలుగురూ రాగానే రాజు, ''మీకు ఒక పరీక్ష పెట్టే ఉద్దేశంతో పిలిపించాను. కాని నాకు ఒళ్ళుపట్టే మంగలికి తేలు కుట్టిందట. వాడు రాలేదు. ఒళ్ళంతా నొప్పులుగా ఉన్నది. ఇప్పటికి వెళ్ళండి,'' అన్నాడు.

నలుగురూ వెళ్ళిపోవటానికి బయలుదేరారు. అయితే వారిలో ఒకడు తిరిగివచ్చి, ''మంగలి రానంతమాత్రాన తమరు బాధపడాలా? దైవ సమానులైన మీకు సేవ చెయ్యటమే గదా మా ధర్మం?'' అంటూ, రాజు వారిస్తున్నా వినిపించుకోకుండా, రాజుకు నూనె పట్టించి, ఒళ్ళు మర్దన చేశాడు. వాడికి సైన్యాధిపతి పదవి లభించింది. వాడి పేరు శూరవర్మ.

"వసుంధర"

ఆ తరవాత కొంతకాలానికి మంత్రి పదవి ఖాళీపడింది. శూరవర్మ తన మిత్రుడైన మహామతికి ఆ ఉద్యోగం సంపాదించే కిటుకు చెప్పాడు. మహామతి ఉదయమే వచ్చి, రాజుగారికి మాలిశ్ చేసి, మంత్రిపదవి సంపాదించాడు.

అదిమొదలు ముఖ్యమైన పదవులు ఖాళీ అయినప్పుడల్లా రాజు తనకు చక్కగా మాలిశ్ చేసినవారికే ఆ పదవులు ఇస్తూ వచ్చాడు. అయితే కొన్ని కొన్ని ఉద్యోగాలకు పోటీలూ, పరీక్షలూ అవసరంలేదు. ఆస్థాన పురోహితుడి పదవి ఖాళీ అయితే, పాత పురోహితుడి కొడుకు తప్ప ఆ ఖాళీ భర్తీ చెయ్యటానికి మరొకడులేడు. తనకు మాలిశ్ చెయ్యనివారికి యిలా ఉద్యోగాలు ఇయ్యవలిసి వచ్చి, రాజుకు బాధ కలిగి, తన కింద ఉద్యోగం చేసే ప్రతివాడూ మొదటిరోజు తనకు మాలిశ్ చేసి తీరాలన్న నియమం పెట్టాడు.

అటుతరవాత రాజుగారికి ఏదో చర్మ వ్యాధి పట్టుకున్నది. రాజవైద్యులు, "తమరు అర్థమైనవారందరిచేతా మాలిశ్ చేయించుకున్నారు. ఎవడికో ఈ చర్మ వ్యాధి ఉండి, తమకు వాడినుంచి సంక్రమించింది. దీనికి చికిత్స చెయ్యగలం, కాని తమరు ఎవరుపడితే వాళ్లచేత ఒళ్లు పట్టించుకోవటం మానాలి," అన్నారు.

రాజు రోగం నయమయింది. "మాలిశ్ శాసనం" రద్దయింది. రాజు ఈ సంగతి మంగలితో చెప్పాడు.

మంగలి నవ్వి, "రాజభక్తి పరీక్షించటానికి మాలిశ్ ఒకటే మార్గం కాదు. మీరు అకారణంగా తిట్టినప్పటికీ, నవ్వుతూ సహించి, క్షమాపణ చెప్పుకునేవాడు రాజభక్తి గలవాడే," అన్నాడు.

ఈ కొత్త సూత్రం మీద రాజు తన కొలువులో ఖాళీలు భర్తీ చేస్తూవచ్చాడు. మాలిశ్ పద్ధతిపోయినా, అది నుడికారంలో అలానే ఉండిపోయింది. ఎవడన్నా అర్హత లేనివాడు ఉద్యోగం సంపాదిస్తే, "వాడు ఎవరికో మాలిశ్ చేసి ఉంటాడు," అని ఇప్పటికీ అంటూ ఉంటారు.



# గాడిద మోత

ఒక గ్రామంలో పిచ్చయ్య అనే చాకలికి సంతానం హెచ్చు. కుటుంబభారం మొయ్యలేక పిచ్చయ్య ఇంటి నుంచి పారిపోయాడు. తరవాత పిచ్చయ్య పెద్దకొడుకు, పదమూడేళ్ళవాడు, ఆ కుటుంబానికి దిక్కయి, దాని భారం మోయసాగాడు.

అయిదేళ్ళు గడిచాక పిచ్చయ్య తిరిగి వచ్చి, తాను మొయ్యలేని బరువు తన కొడుకు మోసినందుకు సంతోషించాడు. తన తండ్రి ఇక తన బరువు కొంత తగ్గిస్తాడు గదా అని కొడుకూ సంతోషించాడు.

కాని పిచ్చయ్య తిరిగి వచ్చినాక కొడుక్కు ఏ విధంగానూ సహాయపడక, తిని కూర్చో సాగాడు. కొన్ని రోజులు చూసి కొడుకు తండ్రికి బుద్ధి చెప్పాలని, పిచ్చయ్య చూస్తుండగా గాడిద మీద అది మొయ్యగలంత బరువు వేసి, ఎగిరి దాని మీద కూర్చున్నాడు. గాడిద కూలబడింది.

అది చూసి పిచ్చయ్య, "ఒరె, ఒరె! గాడిదను చంపావు గదరా! దాని మీద వేసిన బరువు చాలక నువు కూడా కూర్చుంటావా?" అన్నాడు.

"అదే నేను కూడా నిన్ను అడగాలనుకుంటున్నాను. నేను మోస్తున్న బరువు చాలదనా, నా గొంతు మీద కూర్చున్నావు?" అన్నాడు కొడుకు. ఆ మాటతో పిచ్చయ్యకు బుద్ధివచ్చింది.

—అవులపాటి రెడ్డెప్ప.





# స్వర్గానికి అడ్డదారి

పూర్వం రామపురంలో రామశర్మ అనే దిక్కులేనివాడు ఒకడు ఉండేవాడు. వాడు ఊళ్ళోవాళ్ళు చెప్పిన పని చేస్తూ, పెట్టినది తింటూ, రాత్రిపూట భజన మండపంలో పడుకునేవాడు. ఆ మండపంలో హరికథా కాలక్షేపాలు జరిగేవి. ఆ హరికథలు వింటూంటే వాడికి స్వర్గలోకమూ, ఇంద్రుడి వైభోగమూ, అప్సరసల నాట్యాలూ, స్వర్గసుఖాలూ బాగా తలకెక్కాయి.

ఒకనాడు హరిదాసు తీరికగా ఉన్న సమయంలో వాడు ఆయనను, "స్వామీ, స్వర్గసౌఖ్యాలు అనుభవించటానికి సులభమైన మార్గం ఏమిటి?" అని అడిగాడు.

"నాయనా, స్వర్గసౌఖ్యాలు ఎంతో పుణ్యాత్ములకు గాని లభించవు. నువు ఈ లోకపు సౌఖ్యాలు అనుభవించి తృప్తి పడు," అన్నాడు హరిదాసు.

ఆ మాటతో తృప్తిపడక, రామశర్మ, "నాకు ఇహసుఖాల మీద కోరిక లేదు. వీలయినంత త్వరగా స్వర్గాన్ని చేరుకోవాలని నా ఆశ," అన్నాడు.

హరిదాసు విసిగిపోయి, "వైకుంఠ ఏకాదశినాడు ఏ గంగలోనైనా దూకు, స్వర్గం చేరుకుంటావు," అన్నాడు.

రామశర్మ ఆ రాత్రికి రాత్రే ఊరు విడిచి, కాలినడకన కొండలూ, కోనలూ, నదులూ, అరణ్యాలూ దాటి, వైకుంఠ ఏకాదశి నాటికి గంగాతీరం చేరి, గంగకు నమస్కరించి, అందులోకి దూకాడు.

వాడికి తిరిగి స్పృహ వచ్చేసరికి నరకలోకంలో ఉన్నాడు. ఎదురుగా యమధర్మరాజూ, చిత్రగుప్తుడూ కనిపించారు. అదిచూసి వాడు హతాశుడై, "నేను ఇక్కడికి ఎలా వచ్చాను? మహాపర్వదినంనాడు ఆత్మత్యాగం చేసినవాడు నరకానికి

తంజావూరు రాజేంద్రప్రసాదు

పోతాడా? ఏమిటి వింత?'' అని చిత్ర గుప్తుణ్ణి అడిగాడు.

''అది నిజమే కాని. నీకు ఇంకా ఆయుస్సు ఉన్నది. మానవుడి జన్మ ఎత్తినందుకు నీ విధులు నెరవేర్చితేగాని నీకు స్వర్గం లభించదు.'' అన్నాడు చిత్రగుప్తుడు.

''ఇంక నువు వెళ్ళవచ్చు.'' అని యముడు చెయ్యి ఊపేసరికి, రామశర్మ గింగిరాలు తిరుగుతూ వచ్చి, గంగ ఒడ్డున పడ్డాడు.

వాడు లేచి ఒళ్ళు దులుపుకుని, సమీపంలో ఉన్న ఒక పట్టణం చేరి, అక్కడ ఒక వర్తకుడి ఇంట పనికి కుదిరి, త్వరలోనే వారి కుటుంబంలో ఒకడుగా అతికిపోయాడు. వర్తకుడు వాడికి తన కుమార్తె నిచ్చి పెళ్ళిచేసి, తన వ్యాపారాన్ని వాడికి అప్పజెప్పాడు.

కాలక్రమాన రామశర్మకు ఇద్దరు పిల్లలు కలిగారు.

మళ్ళీ వాడి బుద్ధి స్వర్గసుఖాల కేసి మళ్ళింది. మనుష్యజన్మ ఎత్తినందుకు పెళ్ళాడి, సంసార సుఖం అనుభవించి, పిల్లలను కని తన విధులు నిర్వర్తించాడు. అందుచేత అతనికి ఇక స్వర్గానికి పోవచ్చు ననిపించింది. వాడు ఎవరికీ చెప్పకుండా మళ్ళీ గంగలో దూకాడు.

మళ్ళీ వాడు నరకమే చేరాడు.

యమధర్మరాజు వాణ్ణి చూసి చిరాకు పడి, గుడ్లురుముతూ, ''నీ కర్మ పరిపక్వం



కాకుండా అప్పుడే వచ్చావేం?" అని అడిగాడు.

"చిత్తం. ఇంక నేను చెయ్యవలసినది ఏమీ లేదనుకున్నాను." అన్నాడు రామశర్మ, నీళ్ళు నములుతూ.

"మూర్ఖుడా. నీ ఆయుస్సు ఇంకా తీరలేదు. నువు వృద్ధుడవై, సహజ మరణం సంప్రాప్తమైనదాకా ఇక్కడికి రాకు. వెళ్ళు!" అని యముడు వాణ్ణి పంపేశాడు.

కాలం గడిచింది. రామశర్మ సంసార బంధంలో క్రమంగా చిక్కుకుపోయాడు. వాడి పిల్లలు పెద్దవాళ్ళయి, పెళ్ళిళ్ళు చేసుకుని, తాము కూడా పిల్లల్ని కన్నారు. వాడిలో నా ఇల్లూ, నా కుటుంబమూ, అన్న మోజు బలపడింది.

ఒకరోజు రామశర్మ తన మనమడిని ఆడిస్తూండగా, యమదూతలు వచ్చి, ఎదురుగా నిలబడ్డారు. వాళ్ళను చూసి రామశర్మ ఆశ్చర్యపోయి. "అప్పుడే ఏం వచ్చారు?" అని అడిగాడు.

"ఈ లోకంలో నీ ఆయుర్దాయం యివాళతో ముగిసింది. వెంటనే నిన్ను తెమ్మని ఆజ్ఞ అయింది." అంటూ యమదూతలు రామశర్మకు పాశం వేసి పట్టుకుపోయారు.

యమధర్మరాజు రామశర్మను చూసి నవ్వి, "నీ కోరిక తీరింది. ముందు శిక్ష అనుభవించు," అన్నాడు.

"అన్యాయం! మీరు చెప్పినట్టే చేశాను. ఎందుకు నాకు శిక్ష?" అని రామశర్మ అడిగాడు.

"నువు చిత్తశుద్ధితో నీ విధులు నిర్వర్తించక, స్వర్గసౌఖ్యాలకు అడ్డుదార్లు తొక్కావు. నీకు స్వర్గసుఖం కొద్దిగా మాత్రమే దక్కింది. అది కూడా నువు నీ వాళ్ళమీద అనురాగం చూపించిన పుణ్యం మూలంగానే. అందువల్ల ముందు నరకంలో శిక్ష పూర్తిగా అనుభవించి, తరవాత స్వర్గంలో ఆ కొద్ది సుఖమూ అనుభవించగలవు." అన్నాడు యమధర్మరాజు.





# మూర్ఖులు

రంగాపురంలో నాంచారయ్య అనే ధన వంతుడుండేవాడు. తండ్రి ఇచ్చిన ఆస్తితో సముద్రవ్యాపారం చేసి బాగా సంపాదించి, సొంత ఊళ్ళో భూములూ, తోటలూ కొన్నాడు. నాంచారయ్యకు పెద్దతనం వచ్చాక, అతని కొడుకులు వ్యాపారం చూసుకోసాగారు.

నాంచారయ్యకు సింగయ్య అనే జ్ఞాతి ఉన్నాడు. పులిని చూసి నక్క వాత పెట్టుకున్నట్టుగా ఈ సింగయ్య అన్ని రంగాలలోనూ నాంచారయ్యను మించి పోవాలని పోటీ చేసి, పూర్తిగా దెబ్బ తిన్నాడు. అతనికి నాంచారయ్య మీద అమితమైన కసి ఉండేది.

ప్రతిరోజూ సాయంత్రం నాంచారయ్య రచ్చబండకు చేరేవాడు. అక్కడ పోగయే నలుగురు పెద్దలతోనూ లోకాభి రామాయణం మాట్లాడేవాడు.

ఒకరోజు నాంచారయ్య, "మన జమీం దారుగారు అశ్రద్ధ మనిషి. ఆయనకు పన్నులు కావాలిగాని, ప్రజల గొడవ అక్కర్లేదు. ఏటా ఏరుపొంగి, పొలాలను ధ్వంసం చేస్తున్నది. రాతిగోడ కట్టి నట్టయితే ఈ బెడద తప్పుతుంది. అందు కయే ఖర్చులో సగం నాది, మిగతాది మీరందరూ కలిసి భరించండి," అన్నాడు.

నలుగురూ సరే నంటే, సరే నన్నారు.

ఈ సంగతి తెలిసి సింగయ్య, ఒక్కొ క్కరి వద్దకూ వెళ్ళి, "మీరందరూ ఎంత వెర్రివాళ్ళు! నాంచారయ్య మిమ్మల్ని మోసం చేస్తున్నాడు. ఏరు పొంగితే ఏరు దిగువనున్న పొలాలు అతనివే మునుగు తాయి గద? మన పొలాలు మునిగినా పంట కేమీ నష్టం ఉండదు. తన అవస రానికి గోడ కట్టుతూ సగం ఖర్చు ఊరి వాళ్ళ మీద వేస్తున్నాడు!" అన్నాడు.

చెల్లూరి సీతారాజేశ్వరరావు

ఈ మాటలతో అందరూ వెనక్కు తగ్గారు. మరొకసారి నాంచారయ్య, "మన కాలవ మీద వంతెన ఉంటే, ఊళ్ళోకి వచ్చేపోయే వాళ్ళకు ఎంతో సౌకర్యంగా ఉంటుంది. వంతెన కయ్యే ఖర్చులో మూడువంతులు నేను భరిస్తాను, మిగిలినది మీరు భరించండి," అన్నాడు.

అందరూ ఒప్పుకున్నారు. కాని సింగయ్య మళ్ళీ అడ్డుతగిలి, "వంతెన కట్టితే నాంచారయ్య సరుకుల బళ్ళు తిన్నగా ఊళ్ళోకి వచ్చేస్తాయి మిగిలిన వాళ్ళకు ఏమిటి లాభం? బల్లకట్టుతో పని జరిగిపోవటంలేదా?" అన్నాడు.

మళ్ళీ ఊరి పెద్దలు వెనక్కు తగ్గారు.

తరవాత కొద్ది రోజులకు నాంచారయ్య ఊరి పెద్దలతో, "తూర్పున నాకు చిన్న చిట్టడవి ఉన్నది గదా, దాన్ని కాల్చి ఎవరన్నా బొగ్గు చేసుకోదలిస్తే నా కేమీ అభ్యంతరం లేదు," అన్నాడు.

వెంటనే చాలామంది పెద్దలు ఆదరా బాదరా వెళ్ళి చిట్టడవి అంటించారు. అడవి కాలటంతోబాటు, తూర్పుగాలికి ఊళ్ళో కొన్ని ఇళ్ళు కూడా కాలాయి.

సింగయ్య పెద్దలను రెచ్చగొట్టాడు. వాళ్ళు నాంచారయ్య దగ్గిరికి వచ్చి, "మీ వల్ల ఊరికి చాలా నష్టం జరిగింది. ఆ నష్టం మీరు భర్తీచెయ్యండి," అన్నారు.

నాంచారయ్య వారి మీద మండిపడి, "నేను మీకు మంచి చెప్పినప్పుడు అది మీ తలకెక్కలేదు. ఎవరివో చెప్పుడు మాటలు విని నా సలహాలు తోసిపారేశారు. మీకు పనికిరాని సూచన ఒక్కటి చేసేసరికి, ఎవరిని సలహా అడగకుండా, నాతో మాట మాత్రం చెప్పనైనా చెప్పకుండా ఆ చెడ్డ సూచనను మూకఉమ్మడిగా అమలుచేశారు. అనుభవించండి. మీ మూర్ఖత్వానికి నేను బాధ్యుణ్ణికాను," అన్నాడు.

గ్రామస్థులు సిగ్గుతో తలలు వంచుకుని వెళ్ళిపోయారు. కానీఖర్చులేకుండా నాంచారయ్య అడవి బాగయింది. నాంచారయ్య అందులో కొబ్బరితోట వేసుకున్నాడు.



# బెడిసికొట్టిన ఎత్తు

ఒక మారుమూల గ్రామంలో శరభయ్యా అనే పిసినిగొట్టు ఉండేవాడు. అయన కొడుకు రాముడు పట్నంలో చదువుతూ, తన తల్లి పుట్టినరోజుకు రెండువందలు పెట్టి పట్టుచీర కొని పంపుతూ, దాని అసలు ఖరీదు తెలిస్తే తండ్రికి గుండె ఆగిపోతుందని, దాని ఖరీదు వందరూపాయలని శరభయ్యాకు తెలిపాడు.

రెండు రోజుల ఆవతల రాముడికి తండ్రి నుంచి ఉత్తరం వచ్చింది.

"నువ్వు పంపిన చీర ఇక్కడ నూట యాభైకి అమ్మి లాభం చేశాను. ఇంకా పది చీరలకు గిరాకీ ఉన్నది కాబట్టి, అలాటి చీరలు మరి పది కొని పంపవలెను!"

ఈ ఉత్తరం చూసి రాముడికి గుండె ఆగినంత పని అయింది. —బాషా మొహిద్దీన్.





# చెరవాడ్లు

జనపదాలలో పంచాయితీలు నికరమైన న్యాయాన్ని అమలు జరిపే రోజులలో, సీతాపురమనే చిన్నగ్రామంలో గోవిందుడు అనే చిన్న రైతు ఉండేవాడు. ఒకనాడు గోవిందుడు తన తండ్రితో కలిసి తోటలో పని చేస్తూండగా, ఒక మేక వచ్చి చెట్ల పాదులు మేయసాగింది. అది చూసి గోవిందుడి తండ్రి ఒక రాయితో ఆ మేకను కొట్టాడు. ఆ రాతి దెబ్బ ఆ మేక తలకు తగిలి, అది అక్కడే చచ్చింది.

మరుక్షణమే కంచె అవతలి నుంచి ఒక రాయి విసురుగా వచ్చి, గోవిందుడి తండ్రి తలకు తగిలింది. ఆ దెబ్బకు ముసలివాడు కూడా హరీ అన్నాడు.

గోవిందుడు తోట బయటికి పరిగెత్తి వెళ్ళి, మందను తోలుకుపోతున్న గొర్రెల కాపరిని చూశాడు. వాడు తప్ప బయట మరెవరూ లేరు. అందుచేత గోవిందుడు వాణ్ణి పట్టుకుని, గ్రామంలోని పెద్ద మనుషులకు అప్పగించి, వాడు తన తండ్రిని చంపాడని మొరపెట్టుకున్నాడు.

అప్పటికప్పుడే పంచాయితీ ఏర్పాటయింది. పెద్దమనుషులు, గోవిందుడి ఆరోపణ గురించి ఏం చెబుతావని గొర్రెల కాపరిని అడిగారు.

దానికి గొర్రెల కాపరి ఇలా అన్నాడు:

"నా పేరు గోపాలుడు. నా ఊరు ఇక్కడికి ఆరుకోసులు ఉత్తరాన ఉన్నది. అక్కడ ఈ సారి వర్షాలు లేక గొర్రెలకు మేత కరువయింది. అందువల్ల నేను నా గొర్రెలను మేపుకుంటూ ఇటుగా వచ్చాను. నా మందలోని ఒక మేక ఈ గోవిందుడి తోటలోకి పోయి మేయసాగింది. ఆ ముసలాడు దాన్ని రాయితో కొట్టి చంపాడు. కోపంలో ఒళ్ళు తెలియక నేనూ ఆ ముసలాణ్ణి రాయితో కొట్టాను.

ఆ దెబ్బకు ముసలాడు కూడా చచ్చాడు. జరిగినది చెప్పాను. తమందరూ ఏం తీర్పు చెప్పినా శిరసావహిస్తాను.''

వాడు నిజం చెప్పినందుకు అందరూ సంతోషించారు; కాని తమ ఆచారం ప్రకారం వాడికి మరణదండన విధిం చారు. అయితే అదే ఆచారం ప్రకారం గోవిందుడు గోపాలుడి వద్ద కొంత పరిహారం పుచ్చుకుని క్షమించవచ్చు. గోవిందుడు వాణ్ణి క్షమించ నిరాకరిం చాడు. అందుచేత గోపాలుడికి మరణ దండన ఖాయమయింది.

గోపాలుడు గ్రామ పెద్దలతో, ''కర్మ ఫలం అనుభవించవలిసిందే. నాకు ఇది రాసి ఉంటే ఎవరు మాత్రం ఏం చెయ్య గలరు? అయితే నాది ఒక విన్నపం నాకు అయిదు సంవత్సరాల వయసు గల తమ్ముడు ఒకడు ఉన్నాడు. మా తండ్రి చచ్చిపోతూ, తన ఆస్తిని మా ఇద్దరికీ పంచి, వాడి పోషణభారంతో బాటు వాడి వాటా ధనం కూడా నాకు అప్పగించి పోయాడు. ఆ ధనాన్ని నా వంతు ధనంతోబాటు ఒక రహస్యమైన చోట భూమిలో దాచాను. ఆ విషయం నాకు తప్ప మరెవరికీ తెలియదు. నేను ఇక్కడ మరణదండన పడి చచ్చిపోతే ఆ ధనమంతా అక్కడే భూమిలో ఉండి పోతుంది. నా చిన్న తమ్ముడు దిక్కు లేనివాడై పోతాడు. మూడు రోజులు వ్యవధి ఇస్తే, ఆ ధనం పైకి తీసి, దాన్ని



నా తమ్ముడితోబాటు ఎవరికైనా నమ్మకస్తుడికి అప్పగించి వస్తాను,'' అన్నాడు.

''అలా చెయ్యాలంటే నీకు ఎవరైనా జామీను ఉండాలి,'' అన్నారు గ్రామ పెద్దలు.

అక్కడ గోపాలుణ్ణి ఎరిగిన వారెవరూ లేరు. గోపాలుడు అందరి ముఖాలూ పరికించి చూసి, ఠీవిగా కూర్చుని ఉన్న కృష్ణయ్య అనే రైతును చూపించి, ''ఆయన జామీను ఉంటారు,'' అన్నాడు.

కృష్ణయ్య సరేనని ఒప్పుకుని, మూడో రోజు సూర్యాస్తమయం వరకూ గోపాలుడికి గడువిచ్చి పంపాడు. గోపాలుడు తన మందను తోలుకుని వెళ్ళిపోయాడు.

మూడోనాడు మధ్యాహ్నం దాటినా గోపాలుడి జాడలేదు.

''పాపం, అమాయకుడు కృష్ణయ్యగారు తన ప్రాణాల మీదికి తెచ్చుకున్నాడే!'' అని గ్రామస్థులు బాధపడసాగారు. ఎందుకంటే, నేరస్థుడి శిక్ష జామీను ఉన్నవాడు అనుభవించాలి.

సాయంకాలం ఈ సంగతి తేల్చటానికి పంచాయితీ కూడింది.

అయితే సూర్యాస్తమయానికి ఇంకా ఒక ఘడియ వ్యవధి ఉండనగా గోపాలుడు వగర్చుతూ పరుగున వచ్చి, పెద్దలను చేరుకున్నాడు.

వాణ్ణి చూసి అప్రయత్నంగా అందరూ, ''భేష్, గోపాలుడా!'' అన్నారు.

''మాట నిలబెట్టుకునేందుకు తిరిగి వచ్చాను,'' అన్నాడు గోపాలుడు.

''మానవత్వం నిరూపించుకునేందుకు జామీనుంటిని,'' అన్నాడు కృష్ణయ్య.

''గోపాలుడు మాట నిలబెట్టుకున్నాడు. కృష్ణయ్యగారు తన మానవత్వం నిరూపించుకున్నాడు. నేను దయగలవాడినని నిరూపించటానికి గోపాలుణ్ణి క్షమిస్తున్నాను,'' అన్నాడు గోవిందుడు.

పంచాయితీదార్లు ముగ్గురినీ మెచ్చుకున్నారు. ఆ రోజు గోవిందుడే గోపాలుణ్ణి తన అతిథిగా తీసుకుపోయి, మరుసటి రోజు వాణ్ణి సాదరంగా సాగనంపాడు.





# ఫలించని పంచాయితి

ఒక ఊళ్ళో శివరాముడు అని ఒక యువకుడు ఉండేవాడు. అతనికి పెద్ద వాళ్ళెవరూ లేరు. ఉన్న కొద్దో, గొప్పో ఆస్తిని పొదుపుగా వాడుకుంటూ, అతను కాలక్షేపం చేసేవాడు. అతను బుద్ధిమంతుడని తెలిసి చాలామంది అతనికి పిల్లనిస్తామని వచ్చారు. అలా వచ్చిన వారిలో పొరుగూరి కరణంగారు ఒకడు. ఆయన కూతురు పార్వతి చక్కనిది కావటం చేత శివరాముడు ఆమెను చేసుకున్నాడు.

పెళ్ళయిన మూడు నెలలకే శివరాముడికి తన భార్య మీద చిరాకూ, కోపమూ పెరుగుకొచ్చాయి. అందుకు కారణం, పార్వతి దుబారా మనిషి.

ఒకనాడు శివరాముడు పెళ్ళాం కాపరానికి వచ్చిన మూడు నెలలలో అయిన ఖర్చు లెక్క చూసుకుని చిర్రెత్తిపోయాడు. ఇలా జరగనిస్తే త్వరలోనే చిప్ప చేతికి వస్తుంది!

పార్వతి కూడా తన మొగుడి ధోరణి సహించలేక పోయింది. నలుగురున్న ఇంటి నుంచి వచ్చిన మనిషి కావటం చేత వంటలూ, అవీ కాస్త భారీగా చేసింది; కాని భర్త సణుగుడు చూసి తన అలవాటు నిగ్రహించుకునేటందుకు ప్రయత్నం చేసింది. ఇంటికి అవసరమని తోచిన వస్తువులు ఎడా, పెడా కొన్నది. వీధిలో అమ్మకానికి వచ్చిన చీరెలవాణ్ణి పిలిచి, శివరాముడి అనుమతి లేకుండానే, తనకు నచ్చిన చీరలు రెండు కొనేసింది. దానితో శివరాముడు అగ్గిమీద గుగ్గిలం అయిపోయాడు. ఇద్దరి మధ్యా కీచులాటలు రాను రాను మిన్నుముట్టాయి.

ఆఖరుకు ఒకరోజు శివరాముడు పార్వతిని వెంటబెట్టుకుని ఆమె పుట్టింటికి

గవ్వల నిర్మలాదేవి

వెళ్ళి, ఆమె తల్లిదండ్రులతో, "ఇంత దుబారా మనిషితో కాపురం చెయ్యడం నా వల్ల కాదు. తగిన బుద్ధి చెప్పి మీ పిల్లను దారికి తెస్తారో, లేక జీవితాంతం మీ పిల్లను మీ ఇంట్లోనే ఉంచుకుంటారో వెంటనే తేల్చండి," అన్నాడు.

"అమ్మాయికి బుద్ధి చెప్పే బాధ్యత మాది. నువు కాస్త శాంతించు," అని పార్వతి తల్లిదండ్రులు శివరాముణ్ణి బతిమాలుకున్నారు. కూతురి కాపరం ఎక్కడ చెడిపోతుందోనన్న భయం వారికి పట్టుకున్నది. గ్రామాల్లో ఏ కుటుంబకలహాలు వచ్చినా నలుగురు పెద్దమనుషులూ సమావేశమై పంచాయితీ పెట్టి, తోచిన తీర్మానం చేసే ఆనవాయితీ ఉండేది.

పార్వతి తల్లి కాంతమ్మ ఇరుగు పొరుగు అమ్మలక్కల వద్దకు వెళ్ళి, జరిగినది చెప్పి, ప్రస్తుతం తన కూతురు కాపరం నిలబెట్టే బాధ్యత వాళ్ళమీద ఉన్నదని చెప్పుకున్నది. ఇటువంటి కాలక్షేపం కన్న ఆ అమ్మలక్కలకు కావలిసిందేమిటి? వాళ్ళు ఎక్కడి పనులు అక్కడే వదిలేసి, కాంతమ్మ వెంట వచ్చారు.

అదేవిధంగా కరణంగారు కూడా ఇరుగు పొరుగున ఉండే నలుగురు పెద్ద మనుషులనూ తీసుకొచ్చాడు.

సావట్లో మగవాళ్ళు ఒకపక్కా, ఆడవాళ్ళు ఒకపక్కా కూర్చున్నారు. కోపంతో రుసరుసలాడుతూ పార్వతి ఒక



మూల కూర్చున్నది. శివరాముడు తనకు పార్వతి ప్రవర్తన గురించి ఉన్న ఆక్షేపణను అక్కడచేరిన వారందరికీ స్పష్టంగా చెప్పాడు.

ఆడవాళ్ళలో ఒక పెద్ద ముత్తయిదువ పార్వతితో, "చూడమ్మా! మొగుడంటే అంత అలక్ష్యం పనికిరాదు. అతను మాత్రం ఏమంటున్నాడు? పొదుపుగా సంసారం చెయ్యమంటున్నాడు. అలాగే చేస్తే పోయేదానికి ఇంత రాద్ధాంతం దేనికి? తిట్టినా, కొట్టినా, ఆడదానికి మొగుడే దైవం!" అన్నది.

మరొకామె అందుకుని, "దాంపత్యం నూరేళ్ళ పంట! పెడసరంగా బంగారం లాటి సంసారం చెడగొట్టుకోకు. చిన్న దానివి, నీ కింకా ఏమీ తెలీదు. మేమంతా ఎన్నేళ్ళుగా సంసారం చేస్తున్నాం! ఎన్నడైనా ఇలాటి కీచులాటలు ఎరుగుదుమా? మొగుడు చెప్పినట్టు విను." అన్నది.

వెంటనే మూడో ఆమె, "దంచినమ్మకు బొక్కిందే దక్కుడు! ఉడకేసింది ఇంత తిని, అదే మహా భాగ్యమనుకోవాలి ఆడది. ఆడదానికి దురాశలు పనికిరావు, తల్లీ! ఆడదన్నాక మగాడికి అణగి మణగి పడి ఉండాలి." అన్నది.

అక్కడ ఉన్న మగవాళ్ళలో ఒక్కడూ, కనీసం తన తండ్రి అయినా, మాట్లాడక పోవటం పార్వతి గమనించింది. ఆడవాళ్ళు పెత్తనం మీద వేసుకుని, తన వల్ల ఏదో మహాపచారం జరిగిపోయినట్టు



మాట్లాడటం చూసి ఆమెకు మండిపోయింది

నాలుగో ఆడమనిషి ఏదో చెప్పబోతూండగా పార్వతి చప్పున తల ఎత్తి, "ఇక ఆపండి! నాకు బుద్ధి చెప్పే అర్హత మీలో ఎవరికీ లేదు. మిమ్మల్ని చిన్నప్పటినుంచీ ఎరుగుదును. మీరు మీ భర్తల మాట ప్రకారం ఎంతవరకు నడుచుకున్నారో నాకు బాగా తెలుసు. మొగుడికి తెలియకుండా బియ్యమూ, పప్పులూ చాటుగా అమ్ముకుని, నగలు చేయించుకుని, పుట్టింటివాళ్ళు చేయించారని మొగుళ్ళకు చెప్పి మోసగించిన వారు ఒకరు! మొగుడు పొలానికి బయలుదేరగానే ఊరంతా పెత్తనాలు చేసిన వారు మరొకరు! పుట్టింటికి రహస్యంగా మూటలు సర్దినవారు ఇంకొకరు. ఒకరికి బుద్ధి చెప్పేముందు, మనం అందుకు అర్హులమా, కామా అని ఆత్మవిమర్శ చేసుకోవాలి. కాని మీ అదృష్టం ఏమంటే, మీ విషయాలు మీ మగాళ్ళకు తెలిసి కూడా శాంతంగా భరిస్తున్నారు. అందుకు వాళ్ళను మెచ్చుకోవాలి. ఇంటి పనులు పాడుచేసుకుని వచ్చి ఉంటారు. ఇక దయచెయ్యండి." అన్నది.

అంతవరకూ నోరు తెరుచుకుని వింటున్న శివరాముడికి తల తిరిగిపోయింది. ప్రపంచంలో ఇంతటి మహాతల్లులు కూడా ఉన్నారా అనుకుని, అతను మగాళ్ళ కేసి చూశాడు. పార్వతి మాటలను వాళ్ళు ఆమోదించినట్టే అతని కేసి చూశారు. వాళ్ళతో పోలిస్తే తను చాలా అదృష్టవంతుడని అతనికి తోచింది. వాళ్ళ పెళ్ళాలకన్న తన పార్వతి లక్ష రెట్లు నయం.

పంచాయితీ విఫలమయింది. అయితే శివరాముడి సమస్య తీరిపోయింది. అతను ఆ పూటే పార్వతిని వెంటబెట్టుకుని తన ఊరు వెళ్ళిపోయాడు. తరవాత ఆ దంపతుల మధ్య ఎలాటి కీచులాటలూ రాలేదు.





# ముఖస్తుతికి మురిసి

పూర్వం ఒక గ్రామంలో సోమవర్మ అనేవాడు ఉండేవాడు. వాడికి చదువు సంధ్యలు అట్టే అబ్బకపోవటం వల్ల తండ్రి తాతలు సంపాదించిన ఆస్తి మీద బతుకుతూండేవాడు. వాడికి ముక్కు మీద కోపం ఉండేది. అయితే వాడిలో ఒక పెద్ద బలహీనత కూడా ఉండేది. అదేమిటంటే, పొగడ్తకు పొంగిపోవటం.

సోమవర్మ పొరుగున చేరిన ముసలాయన అడపాదడపా సోమవర్మ దగ్గిర చేబదుళ్ళు చేస్తూండేవాడు. అవి తీర్చవలసిన సమయానికి ముసలాయన భార్య వచ్చి, సోమవర్మ బలహీనత గ్రహించినది కావటం చేత, అతన్ని తెగపొగిడి, పాత బాకీ ఇయ్యకపోగా మరికొంత డబ్బు చేబదులుగా తీసుకుపోయేది.

"నాయనా, అదీ ఇదీ కలిపి వచ్చే నెల ఇస్తాను. నీ మనస్సు నవనీతం. అయినా నిన్ను బతిమాలుకోవటం మా ధర్మం కదా! నీ వంటి జాలి గుండె ఎంతమంది కొడుకులకు ఉంటుంది, నాయనా?" అని ముసలావిడ అనేసరికి సోమవర్మ పొంగిపోయేవాడు.

సోమవర్మలో ఉన్న ఈ బలహీనత అతని భార్యకు ఎంతో చిరాకు తెప్పించేది.

ఇలా నెలల తరబడి సాగిపోతున్నది. ముసలాయనకు జబ్బు చేసిందనో, తలవని తలంపుగా ఏదో ఖర్చు వచ్చి పడిందనో, ముసలావిడ సాకుచెప్పి, పాత బాకీ తీర్చటానికి బదులు కొత్త చేబదులు పుచ్చుకుని, సోమవర్మను ముఖస్తుతితో ఉబ్బితబ్బిబ్బయేలా చేసి వెళుతున్నది. దీనికి విరుగుడు ఏమిటో అతని భార్యకు అంతు చిక్కలేదు.

ఇలా ఉండగా సోమవర్మ మేనమామ వచ్చాడు. ఆ సమయంలో సోమవర్మ

మల్లాది వెంకటకృష్ణమూర్తి

ఇంట్లో లేడు. అతని భార్య ఆయనతో తన మొగుడి బలహీనత గురించి విపులంగా చెప్పింది.

ఆ రాత్రి భోజనాలు అయాక సోమవర్మ మేనమామ అతన్నీ, అతని భార్యనూ దగ్గిర కూర్చోబెట్టుకుని, "మా సోమ వర్మను చూస్తే నా కెంతో సంతోషం. వీడు తండ్రి తాతల ఆస్తిని తగలెయ్యకుండా, ఎంతో పొదుపుగా నెట్టుకొస్తున్నాడు. వీడి యీడు వాడే మా పెదనాన్న గారి అబ్బాయి ఆస్తి అంతా అప్పుల వాళ్ళకు ధారపోసేశాడు," అన్నాడు.

ఆ మాటకు సోమవర్మ భార్య పొరిగింటి వృద్ధదంపతులు చేబదుళ్ళు తీసుకుని తిరిగి ఇయ్యకపోవటం గురించి చెప్పింది.

ఆయన బిగ్గరగా నవ్వి, సోమవర్మ భుజం తట్టుతూ, "తప్పమ్మాయ్! నీకు మా వాడి సంగతి ఏమీ తెలీదు. వీడు ఏ పని చేసినా ఎంతో ముందు చూపుతో చేస్తాడు. మీ పెళ్ళి రోజు వచ్చే నెలలో కాదూ? నీ కేదన్నా నగ చేయిద్దామనే ఉద్దేశంతో ఆ బాకీ వసూలు చెయ్యకుండా ఆపి ఉంటాడు. వసూలు చేసి ఉంటే ఈపాటికి ఖర్చు అయేదేగద?" అన్నాడు.

"అవును, మామయ్యా. గాజులు చేయిద్దామని!" అన్నాడు సోమవర్మ.

"వాళ్ళు ఆ బాకీ తీర్చినప్పటి మాట గద!" అన్నది సోమవర్మ భార్య.

"తప్పు, తప్పు! వడ్డీతో సహా వసూలు చేస్తాడు మా వాడు. రేపీపాటికి వసూలు చెయ్యకపోతే చూడు," అంటూ సోమవర్మను అతని మేనమామ ఉబ్బేశాడు.

దాంతో సోమవర్మ ముసలివాళ్ళ దగ్గిరకి వెళ్ళి బాకీ సొమ్ము ఇస్తారా, చస్తారా అని కూచుని, వసూలు చేసుకొచ్చాడు. ఆ డబ్బుపెట్టి సోమవర్మ తన పెళ్ళానికి గాజులు చేయించినదాకా, అతడి మేనమామ వాళ్ళ ఇంటి నుంచి కదలలేదు.

సోమవర్మ భార్య ఆయనకు కృతజ్ఞత చెప్పుకోవటమేగాక ముఖస్తుతికి విరుగుడు ముఖస్తుతేనన్న విషయం తెలుసుకున్నది.





శిళ్ళంగేరి అనే గ్రామంలో ఒక ధర్మదాత పేద బ్రాహ్మణుల కోసం ఒక సత్రం కట్టించాడు. ఆ సత్రంలో రోజుకు అయిదు మంది బ్రాహ్మణులకు ఉచితంగా భోజనం పెడతారు. యాత్రికులైన బ్రాహ్మణులు ఆ సత్రంలో పదిరోజులు ఉండవచ్చు. అలాటి వారికి రోజుకు రూపాయి దక్షిణ కూడా ఇస్తారు.

పక్క గ్రామంలో వెంకన్నభట్టు అనే బ్రాహ్మడుండేవాడు. అతను బీదవాడేమీ కాదు. కాని లోభీ, దురాశపరుడూనూ. ఎలాగయినా ఒక నెల రోజులపాటు శిళ్ళంగేరి సత్రంలో గడిపి, నెలరోజుల పాటు భోజనం ఖర్చులేకుండా చేసుకోవటమే కాకుండా, ముప్పై రూపాయలు అదనంగా సంపాదించుకోవాలని అతడికి దుర్బుద్ధి పుట్టింది. అయితే ఒకే మనిషిని పదిరోజులు మించి సత్రంలో ఉండనియ్యరు. అందుచేత అతను బైరాగిలాగా జుట్టూ, గడ్డమూ, మీసాలూ పెంచుకుని, ఒకనాటి ఉదయం వేళ శిళ్ళంగేరి సత్రంలో దిగాడు.

భోజన వసతులూ, దక్షిణ ఏర్పాటూ చూడటానికి సత్రంలో రామయ్య అనే గుమాస్తా ఉండేవాడు. అతను అదే గ్రామంలో హనుమంతుడి దేవాలయానికి పూజారి కూడానూ. ఆ దేవాలయానికి ఎలాటి ఆదాయమూ లేదు. ఆలయంలో కనీసం దీపారాధన కైనా డబ్బు పోగుచేసే ఉద్దేశంతో రామయ్య ఒక హుండీ ఏర్పాటు చేశాడు.

రామయ్య సత్రంలో ఉండేసమయంలో ఆ హుండీ అతని బల్ల మీద ఉండేది. అతను బ్రాహ్మణులకు దక్షిణ ఇచ్చేటప్పుడు, దైవ కార్యానికి తోచినది ఆ హుండీలో వెయ్యమని యాత్రికులను

కోలార్ పద్మావతి

కోరేవాడు. రూపాయ దక్షిణ పుచ్చుకునే వాళ్లు అంతో ఇంతో హుండీలో వేసేవారు. పరమలోభి అయిన వెంకన్నభట్టు మాత్రం హుండీలో ఒక్క పైసా కూడా వెయ్యలేదు.

పదిరోజులు గడిచాయి. పదకొండో రోజు వెంకన్నభట్టు ఉదయానే లేచిపోయి, తన గడ్డాన్ని పూర్తిగా గొరిగించుకుని, తన దుస్తులూ, పేరూ మార్చుకుని మరో పదిరోజులు అదే సత్రంలో గడిపాడు. ఆ తరవాత తల గొరిగించి, మీసం తీసేసి, మళ్ళీ వేషమూ, పేరూ మార్చుకుని, మళ్లీ పదిరోజులపాటు హాయిగా సత్రంలో ఉన్నాడతను.

నెల ఆఖరు రోజున వెంకన్నభట్టు భోజనం చేసి, తన గ్రామానికి వెళ్ళడానికి సిద్ధమవుతూండగా గుమాస్తా రామయ్య ఇద్దరు గ్రామభటులను వెంటబెట్టుకుని వచ్చి, వెంకన్నభట్టును న్యాయాధికారి వద్దకు తీసుకుపోయి, అతను చేసిన మోసం గురించి ఫిర్యాదు చేశాడు.

"చాలా ఆశ్చర్యంగావుందే! వేషమూ, పేరూ మార్చినా అతన్ని ఎలా గుర్తుపట్టావు?" అని న్యాయాధికారి రామయ్యను అడిగాడు.

అందుకు రామయ్య, "వేషం మారినా, పేరు మారినా గుణం మారదు గదా! ఈ వెంకన్నభట్టు మొదటి పదిరోజులూ హుండీలో పైసా వెయ్యలేదు. వేషమూ, పేరూ మార్చుకుని వచ్చి కూడా ఒక్క పైసా వెయ్యలేదు. వెంటనే నాకు అనుమానం తగిలి ఇతన్ని జాగ్రత్తగా పరీక్షించాను. ఇతను ఎంతకాలం ఇలా మోసం చేస్తాడో చూతామని ఇతన్ని కనిపెడుతూ వచ్చాను. నెల రోజులు ఉండి, ఇక వెళ్ళిపోతున్నాడని తెలిసి, మీ వద్దకు పట్టుకు వచ్చాను," అన్నాడు.

న్యాయాధికారి వెంకన్నభట్టుకు అయిదువందల రూపాయలు జరిమానా వేశాడు. అలాటి లోభికి తగిన శిక్ష పడిందని రెండు గ్రామాలవాళ్ళూ అనుకున్నారు.





# వీర హనుమాన్

హనుమంతుడు సూక్ష్మ రూపంలో నిరాటంకంగా పాతాళలంక సింహద్వారం దాటి నగరంలో ప్రవేశించాడు. అతడికి ఒక దిక్కు నుంచి పెద్ద కోలాహలం వినిపించింది. అతడు ఆ దిక్కుకేసి వెళ్ళాడు.

ఒక చోట పెద్ద పర్వత గుహను అద్భుత శిల్పంతో కాళికాలయంగా నిర్మించారు. ఆలయ ప్రాంగణమంతా తోరణాలతోనూ, మణిదీపాల కాంతులతోనూ వెలిగిపోతున్నది. మైరావణుడి సేవకులైన రాక్షసులు మద్యంతో నింపిన కుండలను వరుసలుగా పేరుస్తూ, శివాలెత్తి పాడుతూ, చిందులు తొక్కుతూ పెద్ద కోలాహలం చేస్తున్నారు.

ఆలయం ముందు డప్పులు, ఢమరులు, రుంజులు మోగుతున్నవి. రామలక్ష్మణులను తెల్లవారుజామున కాళికి బలి యివ్వబోతున్నారని హనుమంతుడు గ్రహించాడు. వెంటనే అతడు బల్లిపిల్లంత అతి సూక్ష్మ రూపంతో, కాళికాలయం గర్భగుడి పైకి వెళ్ళాడు. అక్కడ కాళీవిగ్రహం పాదాలు అభిషేకించే ద్రవాలు పోయడానికి ఏర్పాట్లు జరిగివున్నవి. విగ్రహానికి సూటిగా గుండ్రని రంధ్రం వున్నది. హనుమంతుడు దానిలో నుంచి, గర్భాలయంలోకి దూకాడు.

కాళికా విగ్రహం ఉగ్రస్వరూపంతో, చాలా ఎత్తుగా వున్నది. హనుమంతుడు విగ్రహం ఎదురుగా నిలబడి, "ఓ, మహాకాళీ! నువ్వు, రామలక్ష్మణులనే బలి

**31. రామలక్ష్మణుల రక్షణ**



కోరుతున్నావా ?'' అని రౌద్రంగా గర్జించాడు.

ఆ వెంటనే కాళికాదేవి సౌమ్య రూపంతో ప్రత్యక్షమై, ''హనుమంతుడా! మైరావణుడి ఆయువు తీరిపోయేకాలం సమీపిస్తున్నది. నీకు జయం కలుగుతుంది,'' అని ఆశీర్వదించి, అంతర్థానమైంది.

హనుమంతుడు ఆ మాటలకు చాలా సంతోషించి, గర్భగుడి లోపలి తలుపులు బిగించి, కాళీవిగ్రహం వెనుకకు చేరి, జరగబోయేదానికోసం నిరీక్షించసాగాడు.

ఆ సమయంలో మైరావణుడి రాణివాసంలో చాలా సందడిగా వున్నది. అక్కడ రామలక్ష్మణుల బలి అనంతరం, చంద్రసేనతో మైరావణుడికి జరగబోయే వివాహం కోసం, పెద్దఎత్తున సన్నాహాలు సాగుతున్నాయి. రాణివాసం పాలకురాలు కంటకి అనే రాక్షసి. అది చంద్రసేనకు అలంకరణలు చేస్తూ, మధ్య మధ్య ఆమెను బుగ్గపోట్లుపొడుస్తూ, మైరావణుడి గొప్పదనాన్ని గురించి తెగవాగుతున్నది.

భవనప్రాంగణంలో పెద్ద కోలాహలం బయలుదేరింది. రామలక్ష్మణులు ప్రతిమాకారాల నుంచి, మామూలు స్వరూపంలోకి మార్చబడ్డారు. వాళ్ళనిద్దరినీ ఒక బండి మీద ఎక్కించి, పొడవాటి కొయ్య కర్రలకు తాళ్ళతో గట్టిగా బిగించి కట్టారు. వాళ్ళ శరీరాలు ఎర్రని జపాపుష్పాలతో అలంకరించబడ్డవి. బండిని కాళ్ళు గల భూతసర్పాలు ఈడుస్తున్నవి. రాక్షసులు, రామలక్ష్మణులను పెద్ద ఊరేగింపుతో కాళికాలయానికి తీసుకుపోతున్నారు.

రాక్షసులు పెట్టేకేకలు విని, దానికి కారణం ఏమిటో గ్రహించిన చంద్రసేన చివాలునలేచి, కంటకి వారించేలోపలే భవనప్రాంగణం దాటి, వీధిలోకి పరిగెత్తింది. ఆమెకు పసుపుబట్టలతో, ముఖానికి ఎర్రటి సింధూరం పూయబడిన రాముడు కంటబడగానే, గుండెలు అవిసి కూలిపడి మూర్ఛపోయింది.

చంద్రసేనను అనుసరించి వస్తున్న కంటకి, యిదిచూసి ఎక్కడలేని కోపంతో కొరడా తీసుకుని, మూర్ఛలోవున్న చంద్ర సేనను ఎడాపెడా కొట్టటం ప్రారంభిం చింది. కాని ఎంతకూ చంద్రసేనలో చలనం కనబడకపోయేసరికి విసిగి, ఆమెను ఎత్తుకుపోయి భవనంలోని ఒక గదిలో బంధించింది.

కంటకి, కాళికాదేవి పాదతీర్థ ప్రధాన అర్చకురాలు. ఆ పని చూసేందుకామె ఆలయంలోకి పరిగెత్తింది. మైరావణుడు గాని, అహిరావణుడు గాని దేవీపాదతీర్థ మని పిలవబడే మద్యాన్ని, కంటకి చేతి మీదుగా తాగవలసిందే.

రాక్షసులు, కాళిని మద్యంతో అభిషేకించటం మొదలుపెట్టారు. గుంద్రని రంధ్రంలో నుంచి ధారగా పడు తున్న మద్యాన్ని చూసి హనుమంతుడు అసహ్యించుకుని, గర్భాలయం ఎత్తున దేహాన్ని పెంచి, ''ఇక మద్యాన్ని ఆపి, పాలతో అభిషేకించండి!'' అని, కాళి మాట్లాడుతున్నట్టుగా అరిచాడు.

హనుమంతుడు యిలా అనగానే దేవా లయం వెలుపల కోలాహలం ఒక్కసారిగా ఆగిపోయింది. కాళి మద్యం వద్దనటం రాక్షసులందరికీ ఆశ్చర్యం కలిగించింది. సోమసూత్రంగుండా, తీర్థకుండంలో పడే



మద్యాన్ని తాగేందుకు పానపాత్రలతో రాక్షసులు సిద్ధంగా వున్నారు.

బండి మీద తాళ్ళతో కట్టబడివున్న రాముడు, లక్ష్మణుడి కేసి చూసి చిరునవ్వు నవ్వాడు. కంటకి, మైరావణుడి కేసి దిగాలుపడుతూ చూసింది. మైరావణుడు ఎక్కడలేని ఆశ్చర్యంతో కళ్ళింతచేసి, పక్కనేవున్న అహిరావణుడి కేసి చూశాడు. అహిరావణుడు తలపంకించి, ''తమ్ముడా మైరావణా! ఇందులో ఆశ్చర్యపడవలసిం దేమీలేదు. రామలక్ష్మణులు సాత్విక మూర్తులు గదా! మద్యానికి యీ సాత్వి కాహారం కొరగానిదవుతుంది. అందుకే. దేవి పాలు కావాలంటున్నది,'' అన్నాడు.



"అన్నా, బహుబాగా చెప్పావు. నిత్యం దేవీపాదతీర్థమద్యాన్ని తాగే నీలాగా, మాకు ఆమె ఆంతర్యం ఎలా తెలుస్తుంది ?" అని మైరావణుడు, రాక్షసులను కాళిని పాలతో అభిషేకించమని ఆజ్ఞాపించాడు.

రాక్షసులు పెద్ద పెద్ద పాత్రలతో పాలు తెచ్చి కాళీదేవిని అభిషేకించసాగారు. హనుమంతుడు తీర్థకుండానికి పైగా వున్న రంధ్రం దిగువగా నోరు తెరిచి, ధారగా పడుతున్న పాలన్నిటినీ తాగటం ప్రారంభించాడు. అతడికి ఉత్సాహమూ, బలమూ కలిగాయి.

కొంతసేపటికి అభిషేకం పూర్తయింది. మైరావణుడు ఉత్సాహంగా గర్భగుడి తలుపుల దగ్గరకుపోయి మోకరిల్లి, "కాళీ మాతా! నీ దర్శనం చేసుకునేందుకు అనుజ్ఞకావాలి," అన్నాడు.

వెంటనేలోపలినుంచిగంభీరస్వరంలో, "మైరావణా! ముందుగా నీ అన్న అహిరావణుణ్ణి ఫలపుష్ప, నైవేద్యాలతో అర్చనకు పంపు," అన్నమాటలు వినిపించినై.

మైరావణుడు తన అన్న దగ్గిరకువచ్చి, "అన్నా, మాతకు నీ వంటేనే ఎక్కువ వాత్సల్యం. ఆమె, నిన్ను నైవేద్యాలతో రమ్మని ఆజ్ఞాపిస్తున్నది," అని చెప్పాడు.

అహిరావణుడు పర్వతంలాంటి తన దేహాన్ని అటూయిటూ ఊపుతూ, ఫలపుష్పాలూ, ఇంపైన భక్ష్యాలూ, బంగారు పాత్రలో మధువూ తీసుకుని తలుపుల దగ్గిరకు వెళ్లాడు. హనుమంతుడు ముందుగానే లోపలిగడియ తీసివుంచాడు. అహిరావణుడు తలుపులు వెనక్కు నెట్టి లోపల ప్రవేశించగానే, తలుపులు రెండూ చప్పున మూసుకున్నాయి.

అహిరావణుడు తాను తెచ్చిన నైవేద్యాలను దించబోతున్నంతలో హనుమంతుడు అతడి గొంతు వడిసిపట్టుకుని, బలంగా నొక్కి, కిక్కురుమనకుండా అతణ్ణి చంపేశాడు. తరవాత హనుమంతుడు, అహిరావణుడు తెచ్చిన ఫలభక్ష్యాలను తృప్తిగా తిని, బంగారుకలశంలోని

మధువును తాగాడు. ఇప్పుడతడికి మరింత ఉత్సాహోద్రేకాలు కలిగాయి.

హనుమంతుడు చుట్టూ ఓమారు కలయ చూసి, అహిరావణుడి కళేబరాన్ని, గర్భ గుడిలోని ఒక చీకటిమూలకు తన్ని, "మైరావణా! ఇప్పుడు రామలక్ష్మణులను లోపలికి పంపు. నా ప్రియతమభక్తుడు అహిరావణుడు వాళ్ళచేత ముందు నాకు మంత్రయుక్తంగా పూజ చేయించాలి,'' అని కేకవేసి, తలుపులకున్న గడియను తీసివుంచాడు.

మైరావణుడు, రామలక్ష్మణులను గర్భ గుడిలోకి నెట్టాడు. కాళికావిగ్రహం వెనక దాగివున్న హనుమంతుడు చిన్నగొంతుతో, ''రఘువీరుల్లారా! ముందు తలుపులకు లోపల గడిపెట్టి, తయారుగా వుండండి,'' అన్నాడు కాళి పలుకుతున్నట్టుగా.

ఆ మాటలు విని లక్ష్మణుడు ఆశ్చర్య పోతూ రాముడి కేసి చూశాడు. రాముడు మందహాసం చేసి, ''లక్ష్మణా, యింకా సంగతి అర్థంకాలేదా? ముందు తలుపులకు గడిపెట్టు,'' అన్నాడు.

లక్ష్మణుడు తలుపులు బంధించగానే, ''ఇక విగ్రహం వెనకకు రండి!'' అన్న మాటలు వినిపించినై.

రామలక్ష్మణులు కాళీవిగ్రహం వెనకకు పోయి, హనుమంతుణ్ణి చూసి పరమా



నందంచెందారు. లక్ష్మణుడు యింకా దిక్కులుచూస్తూ, ఆశ్చర్యంలో వుండటం గమనించి రాముడు, ''లక్ష్మణా! కాళీదేవి తనకు మద్యంతో అభిషేకం వద్దన్నప్పుడే, గర్భగుడిలో మన హనుమంతుడున్నాడని నేను గ్రహించాను,'' అన్నాడు.

రాముడిలా చెప్పిన తరవాత లక్ష్మణుడికి సంగతి సందర్భాలు అర్థమయినై. హను మంతుడు, రామలక్ష్మణులకు కాళీ విగ్రహం ముందు పూజ కోసం పెట్టిన సరికొత్త విల్లులూ, అమ్ములపొదులూ చూపించాడు. రామలక్ష్మణులు విల్లంబులు తీసుకున్నారు. హనుమంతుడు తన శరీ రాన్ని పెంచి, రామలక్ష్మణులను భుజాల



మీద ఎక్కించుకుని, విగ్రహం ముందున్న బాణాలన్నిటినీ కట్టగాకట్టి పట్టుకున్నాడు.

గర్భాలయం వెలుపల రాకసులు పెద్ద కోలాహలం చేస్తున్నారు. వాళ్ళకు రామలక్ష్మణుల బలి చూడాలని ఆదుర్దాగా వున్నది. బలికిగాను పెట్టిన ముహూర్తం దాటిపోతున్నది. అయినా గర్భగుడిలో వున్న రామలక్ష్మణులను అహిరావణుడు బయటికి తెచ్చే సూచనలు కనబడలేదు.

గర్భగుడిలో ఏదో మోసం జరిగి వుంటుందన్న అనుమానం ముందుగా కంటకికి కలిగింది. ఆ రాకసి జాగ్రత్తగా తలుపుసందుల్లోనుంచి చూసింది. దానికి ఎక్కడా కాళిని అభిషేకించిన పాలు ఆలయంలో పడిన సూచనలే కనిపించలేదు. అంటే దాని అర్థం, గర్భాలయంలో ఎవరో ప్రమాదకారుడైన శత్రువు చేరాడన్నమాట!

కంటకి యిలా ఆలోచిస్తూనే కీచుమంటూ పెద్దగా అరిచింది. రాకసులు దానిచుట్టూ మూగి, ''లోపల నీకేం కనబడింది? కాళీమాత నిన్ను బలి కోరిందా?'' అని అడిగారు.

ఆ ప్రశ్నకు కంటకి మరింత పెద్దగా అరిచి, ''ఓరీ, మందమతుల్లారా, మన కళ్ళముందే పెద్దమోసం జరిగిపోయింది. మన రహస్యాలను శత్రువులకు చెప్పే మనిషి ఒక్కరే వున్నారు—అది చంద్రసేన. కొరడాతో దాని ఒళ్ళు చితకబాదితే గాని, అది నిజం చెప్పదు.'' అంటూ చంద్రసేన వున్న మందిరం కేసి పరుగులు తీసింది.

కంటకి మాటలు విన్న రాకసులు దిగాలుపడిపోయి, ఒకరిముఖాలొకరు చూసుకోసాగారు. ఆ రాకసి అనుమానించినట్టు నిజంగానే గర్భాలయంలో ఎవరైనా శత్రువు చేరాడా? మహాబలుడైన మైరావణుడు పాలించే పాతాళలంకను చేరగల శత్రువు ఎవరు?

ఇలా ఆలోచిస్తూ, రాకసుల్లోని కొందరు ధైర్యవంతులు గర్భాలయద్వారం కేసి

నడిచారు. వాళ్ళు తలుపుల మీద చేయి వేసేంతలో, లోపలినుంచి హనుమంతుడు పెద్దగా సింహనాదంచేసి, ద్వారం కూలేలా కాలితో గట్టిగా తన్ని, బయటికి వచ్చాడు.

హనుమంతుణ్ణి చూస్తూనే రాక్షసులు, "మోసం! మోసం!" అంటూ కేకలు పెట్టారు. హనుమంతుడి భుజాల మీద వున్న రామలక్ష్మణులు, రాక్షసుల మీద బాణ వర్షం కురిపించసాగారు. రాక్షసులు హాహాకారాలు చేస్తూ చెల్లాచెదరుగా పారిపోవటం ప్రారంభించారు.

కాళికాలయం ముందు నిలబడి, తన ముఖ్యానుచరులతో మాట్లాడుతున్న మైరావణుడు తల తిప్పి, హనుమంతుడి భుజాల మీద ఉన్న రామలక్ష్మణులను చూస్తూనే పెద్దగా హుంకరించి, ధనుర్బాణాలు తీసుకుని యుద్ధానికి సిద్ధమయ్యాడు.

రామలక్ష్మణులు యినుమడించిన ఉత్సాహంతో, మైరావణుడి మీద బాణాలు ప్రయోగించారు. ఆ బాణం దెబ్బలు తగిలి మైరావణుడి శరీరం నుంచి కారి కింద పడే ప్రతి రక్తబిందువు నుంచీ, ఒక్కొక్క మైరావణుడు పుట్టుకురాసాగాడు. వాళ్ళు కూడా మైరావణుడిలాగానే హుంకార ధ్వనులు చేస్తూ, రామలక్ష్మణుల మీద బాణప్రయోగం చేయసాగారు.

రామలక్ష్మణులు యిదిచూసి ఆశ్చర్య చకితులై హనుమంతుడితో, "హనుమంతుడా, ఏమిటీ వింత? ఇంతమంది మైరావణులను రక్తపుచుక్క నేల బడకుండా వధించటం ఎలా?" అన్నారు.

ఆ ప్రశ్నతో హనుమంతుడికి, సువర్చలా దేవి చెప్పిన చంద్రసేన గుర్తుకువచ్చింది. హనుమంతుడు ఒకటి రెండు మాటల్లో సంగతి రామలక్ష్మణులకు చెప్పి, ఆకాశంలోకి ఎగిరి, ఒక ఎత్తయిన చోట రామలక్ష్మణులను దించి, తానుచంద్రసేన వుండే భవనం కేసి పరుగుతీశాడు. రామలక్ష్మణులు, లక్షలసంఖ్యలో పుట్టుకొచ్చిన మైరావణమూక మీద ఎడాపెడా బాణాలు ప్రయోగిస్తూనే వున్నారు.





# సర్దార్ వల్లభాయ్ పటేల్

ఆధునిక భారతదేశ నిర్మాతల్లో ఒకరైన వల్లభాయ్ పటేల్, ఒక శతాబ్దానికి ముందు—1875 అక్టోబర్ 31 వ తేదీన గుజరాత్‌లోని కరమ్‌సద్ గ్రామంలో జన్మించారు.

చిన్నవయసు నుంచే వల్లభాయ్‌లో పట్టుదలా, ప్రతిబంధకాలను అధిగమించే శక్తిసామర్థ్యాలూ వుండేవి. ఆయన ఎంతో శ్రమపడి చదివి, న్యాయశాస్త్రంలో పట్టభద్రులయారు. న్యాయవాదిగా తాను సంపాయించే డబ్బుతో, తన అన్న అయిన విఠల్ భాయ్ పటేల్‌ను లండనుకు పంపి, ఆయన చేత బార్ ఎట్ లా పరీక్ష చదివించారు. వల్లభాయ్ కూడా తరవాత బారిష్టర్ పరీక్ష పాసయి, అహమ్మదాబాదులో న్యాయవాదవృత్తి ప్రారంభించారు.





అవి గాంధీజీ దక్షిణ ఆఫ్రికా నుంచి భారత దేశానికి తిరిగివచ్చిన రోజులు. ఆయన ఒకసారి గుజరాత్ క్లబ్‌లో ఉపన్యసించారు. ఆ సమయంలో వల్లభాయ్ ప్రేక్షకుల్లో వున్నారు గాని, గాంధీజీ ఉపన్యాసం ఆయన నేమీ ఆకర్షించలేదు.



కొన్నాళ్ళ తర్వాత గాంధీజీ గుజరాత్ లోని చంపారన్ ప్రాంతంలో ఒక ప్రజో ద్యమం ప్రారంభించారు. అక్కడి నీలి మందు తోటల్లో పనిచేసే కూలీలకు, వాటి యజమానులు సరిఅయిన వేతనాలివ్వక, అతిదారుణంగా దోచుకునేవారు. ఆ ఉద్యమ సమయంలో గాంధీజీ ప్రదర్శించిన పట్టుదలా, ధైర్యసాహసాలూ వల్లభాయ్‌ని బాగా ఆకర్షించాయి.



ఆ కాలంలోనే ఖేడా జిల్లాలో భయంకరమైన క్షామం వచ్చింది. ప్రజలు తిండికి లేక అవస్థ పడుతూంటే, ప్రభుత్వం నిర్బంధంగా పన్నులు వసూలుచేయాలని చూసింది. గాంధీజీ దానికి వ్యతిరేకంగా సత్యాగ్రహం ప్రారంభించారు. ఆ సత్యాగ్రహోద్యమంలో వల్లభాయ్, ఆయనకు కుడిభుజం. వల్లభాయ్ 1920 నాటి, సహాయ నిరాకరణోద్యమంలో ఎనలేని పాత్ర వహించారు. భూమిశిస్తు పెంచేందుకు



ప్రభుత్వం ప్రయత్నించినప్పుడు, బార్డోలీ ప్రాంత రైతాంగాన్ని సమీకరించి, ఆయన విజయం సాధించారు. అప్పటినుంచీ ఆయనను ప్రజలు సర్దార్ వల్లభాయ్ అని పిలవసాగారు. 1931 వ సంవత్సరాన కరాచీనగరంలో జరిగిన భారత జాతీయ కాంగ్రెసు మహాసభకు ఆయన అధ్యక్షుడు. ఆ తరవాత కొద్ది రోజుల్లోనే ఆయన అరెస్టు చేయబడి, గాంధీజీతో పాటు ఎరవాడ జైల్లో పదహారు నెలల కాలం వున్నారు.



1939 వ సంవత్సరంలో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైనప్పుడు బ్రిటిష్ ప్రభుత్వం, జాతీయ నాయకులతో ఎలాంటి సంప్రతింపులైనా చేయకుండా, భారతదేశాన్ని ఆ యుద్ధంలోకి లాగింది. ఈ చర్య జాతీయ నాయకులను చాలా అసంతృప్తి పరిచింది. "యుద్ధంలో మా సహకారం కావాలంటే, ముందు దేశం స్వతంత్రం కావాలి," అని జాతీయ కాంగ్రెస్ తీర్మానించింది.



గాంధీజీ, సర్దార్ వల్లభాయ్ పటేళ్ళతో పాటు, ముఖ్యులైన కాంగ్రెస్ నాయకులంతా అరెస్ట్ చేయబడ్డారు. ప్రజల వ్యతిరేకతను బ్రిటిష్ ప్రభుత్వం అతి క్రూరంగా అణచజూచింది. ప్రజా సమూహాల మీద విచ్చలవిడిగా కాల్పులు జరిగినై. తిరుగుబాటుదార్లను జైళ్ళలో నానా హింసలకూ గురి చేశారు.



భారతీయులు కొన్ని దశాబ్దాలపాటు స్వాతంత్ర్యం కోసం చేసిన పోరాటం, త్యాగాల ఫలితంగా, దేశానికి 1947 ఆగష్టు 15 వ తేదీన స్వాతంత్ర్యం సిద్ధించింది. దేశానికి పండిట్ నెహ్రూ ప్రధాన మంత్రి అయ్యారు. సర్దార్ వల్లభాయ్ పటేల్ ఉపప్రధాని.

భారతదేశం స్వతంత్రమైన తరుణం లోనే, అనేక విషమ సమస్యలు ఎదురయ్యాయి. దేశంలో అనేక ప్రాంతాల హిందూ, ముస్లిం కలహాలు ప్రారంభమయినై. దేశీయాంగ మంత్రిగా సర్దార్ వల్లభాయ్ ఎంతో నైపుణ్యమూ, దక్షతా ప్రదర్శించి, వాటిని అదుపులోకి తెచ్చారు.





దేశంలో చిన్నా, పెద్దా కలిసి, దాదాపు ఆరువందల స్వదేశ సంస్థానా లున్నాయి. ఈ సంస్థానాధిపతుల్లో కొందరు, బ్రిటిష ప్రభుత్వం పైదొలగ గానే సర్వ స్వతంత్రులు మవుదామని కలలుకన్నారు. కాని, సర్దార్ వల్లభాయ్ దృఢనిశ్చయంతో గట్టి చర్యల ద్వారా, యీ సంస్థానాలన్నిటినీ రద్దు చేసి, మిగతా దేశంతో ఐక్యపరిచారు.

ఈ విధంగా సర్దార్ వల్లభాయ్ పటేల్ జాతీయ జీవన రంగంలో ఎన్నో ఒడిదుడుకులను ఎదుర్కొని, విజయుడై నిలిచాడు. భారతదేశంలో జన్మించిన మహనీయుల్లో ఒకరని, నిస్సంశయంగా చెప్పుకోదగిన ఈయన 1950వ సంవత్సరంలో మరణించారు. దేశ స్వాతంత్ర్యం కోసం సర్దార్ వల్లభాయ్ చేసిన సేవా, త్యాగాలూ అమూల్యమైనవి.



# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25లు గెలవండి!

?

హసన్, అలీ అనే ఇద్దరు అరేబియా వాళ్ళు ఒక మేక విషయమై తగాదా పడ్డారు. ఇద్దరూ ఆ మేక తనదని వాదించారు. వాదన తెగలేదు. అది చూసి ఎరిగిన వాళ్ళు వాళ్ళిద్దరినీ న్యాయాధికారి అయిన జుహా వద్దకు వెళ్ళి ఫిర్యాదు చెయ్యమన్నారు.

"మీ తగాదా ఏమిటి?" అని జుహా వారిని అడిగాడు.

"దొరగారూ, ఈ మేక చిన్నతనం నుంచీ నా వద్దనే పెరిగింది. దాన్ని నేను పెంచి పెద్ద చేశాను. ఒకనాడు అది అకస్మాత్తుగా మాయమయింది. వెతికితే అది ఈ పాపిష్ఠి మోహం అలీ ఇంట కనిపించింది. దాన్ని దొంగలించాడని నేనంటే, నేనే తన మేకను దొంగిలించానని అన్నాడు, అబద్ధాలకోరు!" అన్నాడు హసన్.

అలీ కూడా ఆ మేక చిన్నతనం నుంచీ తన వద్ద పెరిగిందనీ, మధ్యలో హసన్ కాజేశాడనీ అన్నాడు.

జుహా ఇద్దరి ముఖాలూ పరీక్షగాచూసి, "ఇద్దరు వ్యక్తులు దీర్ఘ కాలం కలిసి ఉంటే ఇద్దరి మధ్యా పోలికలు ఏర్పడతాయన్నది అందరికీ తెలిసినదే. అలీ ముఖం చూడండి! అచ్చు మేక ముఖంలా లేదూ? మేక అలీదే!" అని చుట్టూ చేరిన వారి ఎదట తీర్పు చెప్పి, తన గాడిదను ఎక్కి బయలుదేరాడు.

హసన్ పట్టరాని ఆగ్రహంతో, వెళ్ళిపోయే జుహాను చూసి, "నిజమే మరి! అందుకే ఆ ఇద్దరిలో ఏది గాడిదో తెలియటం లేదు!" అన్నాడు.

★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2&3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలించబడవు.

కార్డులు మాకు ఏప్రిల్ 20 లోగా చేరాలి. అందులో ఫోటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, '77 జూన్ చందమామలో ప్రకటించబడతవి.

---

ఫిబ్రవరి నెల పోటీ ఫలితం: ఆడువారి పాటలకు అర్థాలు వేరులే!

గెలుపొందినవారి పేరు: బి. వి. పద్మావతీదేవి,

C/o. శ్రీ బి. రాజేశ్వరమూర్తి, మచిలీపట్నం-2

## పోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1977 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.



★



T. V. Seshagiri D. N. Shirke

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ ఏప్రిల్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల.పోటీ, మద్రాసు–26.

---

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అక్షయమస్తు

రెండవ ఫోటో : అమృతమస్తు

పంపినవారు : జి. సునందిని, 16/578, వి. వి. అగ్రహారం, నెల్లూరు-1

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor : NAGI REDDI

# అమృతాంజన్

## తలనొప్పులకు జలుబులకు బెణుకులకు ఇంటింటా ఉండవలసిన దివ్యౌషధము







నొప్పులకు, జలుబులకు, బెణుకులకు ఉపశమనం కలిగించే అమృతాంజన్‌ను బాధగా ఉన్నచోట కొద్దిగా రాసి రుద్దండి. దానిలో చేరి ఉన్న పది శ్రేష్ఠమైన ఔషధాలు నిమిషాలమీద గుణంకలిగిస్తుందని మీరు తెలుసుకొంటారు. ఆదాచేసే పెద్ద సీసాలలోను, చిన్న సీసాలలోను తక్కువ వెలకు ఇమిడికగా చిన్న డబ్బాలలోను లభిస్తుంది.

అమృతాంజన్ - 80 సంవత్సరాలకు పైబడిన నమ్మకమైన దివ్య ఔషధము.

అమృతాంజన్ లిమిటెడ్




AM-1255


రామ్ శ్యామ్‌లకు హైజాకర్‌తో భేటీ
రామ్, శ్యామ్‌లకు మళ్ళీ సెలవుల హుషారు
విమానంలో బయల్దేరారీసారి షికారు.
అమ్మో! విమానాల దారి మళ్ళించే మొనగాడు—
చేత తుపాకీతో హాజరు అయినాడు
వెళదాం ఆ దురాంతకుని వెనకే మనం, చేద్దాం మరి చేతనైతే సాయం పాపం.
మొనగాని వీపుపై తుపాకీ వున్నట్లయినది, మన రామ్ పెట్టిన పాపిన్స్ ప్యాకే మరి అది.
అంతే, అదిరిపడ్డాడు అతగాడు, పైలెట్ తుపాకీ లాగేశాడు, మరో దారిలేని మొనగాడు కాలికి బుద్ధి చెప్పేశాడు.
రామ్, శ్యామ్‌లే రక్షించారు ఆరోజు
'పాపిన్స్ హీరో' అని మెచ్చారు అందరు ఆరోజు!
నోరూరించే మనసుదోచే మైమరపించే
పార్లే పాపిన్స్
పండ్లరుచిగల పిప్పరమెంట్లు
5 పండ్ల సువాసనలలో—
రాస్పబెరి, అనాస, నిమ్మ
నారింజ, మోసంబి.
PARLE POPPINS MIXED FRUITY SWEETS